# తిరువాయ్‌మొ*ழி* ప్రబంధ వ్యాఖ్యానాలు - ఎమ్బెరుమానార్ నిర్వాహాలు, వార్తలు, ఐతిహ్యాలు

**(7) (3-4-10) - ఈడువ్యాఖ్య**

**(ఆవి శేర్ - ఇత్యాది) "ఆవి యుణ్డు - ప్రాణాశ్రయమాన శరీరమ్. అత్తోడు శేర్న్దిరున్దుళ్ళ ఉయిరుణ్డు - ఆత్మా. అదిన్ పక్కల్ అన్ద శరీరగతమాన బాల్యయౌవనాదికళ్ ఒన్రాలుమ్ ఒరు సంబంధమిల్లైయామ్బడియాక అనుసంధిక్కిఱ అనుసంధానమానదు అన్ద ఆత్మావుక్కు క్కూడానిన్ఱ పిన్బు అప్పొరుళ్ అవనైయుమ్ కూడ త్తట్టిల్లై.**

**ఇజ్ఞనన్ఱిక్కే, "ఇదుక్కు వేఱేయు మిరణ్డు పొరుళ్ శొల్లువర్కళ్" - ఎన్ఱు అరుళిచ్చెయ్‌వర్. అవన్ పక్కలిలే భక్తియుణ్డాకిల్ అవనై క్కిట్టలామ్ - ఎన్ఱుమ్, పుఱమ్బుణ్డాన ఉపాయాంతరజ్ఞళిల్ ఉణ్డాన ప*ఱ్ఱు* అఱ్ఱియవిట్టు, అవనైయే ప*ఱ్ఱి*ల్ అవనై క్కిట్టలామ్ ఎన్ఱుమ్, అన్ఱియే, అంతిమ ప్రత్యయ ముణ్డామాకిల్ అవనై క్కూడలామ్ - ఎన్ఱుమామ్. ఇత్తై ఎమ్బెరుమానార్ కేట్టరుళి, "కీ*ழ்* వ్యాప్తియై చ్చొల్లి నిన్ఱ పిన్బు, ఇని, వ్యాప్యవస్తుగతమాన దోషజ్ఞళ్ వ్యాపకనానవనుక్కు త్తట్టాదెన్నుమిడమ్ అవశ్యమ్ శొల్లవేణుమ్. ఆనపిన్బు ఇత్తైయే శొల్లి*ఱ్ఱా*క అమైయుమ్" ఎన్ఱరుళిచ్చెయ్‌వర్.**

**(ఆవిశేర్ - ఇత్యాది. - "ఆవిది"** - అంటే - ప్రాణానికి ఆశ్రయమైన శరీరం. ఆ ప్రాణంతో చేరి ఉండే ప్రాణమున్నది- అది ఆత్మ, దానికి, ఆ శరీరానికి చెందిన బాల్య, యౌవనాదులతో దేనితోను ఏ సంబంధం లేదని పలికే అనుసంధానమనేది ఆ ఆత్మకు పొసగినపుడు, ఆ అర్థం అంటే - ఆత్మగతదోషాలు భగవంతునకు కూడా సంక్రమించవు - అనే అర్థం పొసగడంలో లోటు లేదు.

ఈ విధంగా కాకుండా "దీనికి వేఱే రెండర్థాలను పూర్వులు పల్కుతారు" - అని అంటారు. అవి ఏవి? అంటే, భగవంతునిపట్ల భక్తి ఏర్పడితే, అతనిని చేరవచ్చు - అని, బయట ఉండే - ఉపాయాంతరాలలో ఉండే - సంగాన్ని విడచి, భగవంతునే ఆశ్రయిస్తే అతనిని పొందవచ్చు - అని. ఈ రెండేకాక, అంతిమస్మృతి

ఉంటే అతనిని (భగవంతుని) పొందవచ్చు – అనేది (పూర్వులు పల్కిన) మూడవ అర్థం.

వీనిని శ్రీరామానుజులు ఆలకించి, "పాశురంలో ముందు వ్యాప్తిని పల్కినందున, వ్యాప్యవస్తువైన ఆత్మలో ఉండే దోషాలు వ్యాపకుడైన భగవంతునకు సోకవు – అనేది తప్పక పలకాలి. అందువల్ల ఇక్కడ ఆ అర్థాన్ని పల్కడమే తగును" అని అన్నారు.)

**"ఆవి శేర్ ఉయిరినుళ్ళాల్ ఆదుమోర్ పఱ్ఱిలాద పావనై అదనై క్కూడిల్ అదనైయుమ్ కూడలామే"** (ప్రాణాశ్రయమైన శరీరంతో చేరి ఉండే ఆత్మకు, ఆ శరీరగతమైన బాల్యయౌవనాదులలో దేనితోను ఏ సంబంధం లేదు – అనే మాట పొసగితే, ఆ మాట భగవంతుని పట్ల కూడా పొసగుతుంది) అని నమ్మాழ்వార్లు పల్కిన సూక్తిని వ్యాఖ్యానిస్తూ నమ్బిళ్ళై పలు అర్థనిర్వాహాలను ప్రస్తావించారు.

చేతనాచేతనాలతో భగవానుడు సదా కూడి ఉన్నా, వాటి స్వరూపగత – స్వభావగత దోషాలేమీ చెందని రీతిలో అతడుంటాడు. ఏ విధంగా? అంటే – శరీరానికి కలిగే బాల్యయౌవనాద్యవస్థలు ఆ శరీరంలో నిలచి ఉండే ఆత్మకు కలుగవు – అనేది ఆత్మవిషయంలో పొసగుతున్నపడు, ఆత్మకు కలిగే దోషాలు (కర్మానుభవం ఇత్యాదులు) భగవానునకు కలుగవు – అనేది కూడా అతనికి పొసగుతుంది కదా! ఇక్కడ ఈ అర్థమే కాక మఱికొన్ని అర్థాలు కూడా వ్యాఖ్యాతచే తెలుపబడ్డాయి.

**"ఆవి శేర్ ఉయిరినుళ్ళాల్** = ఆత్మ లోపల ఉండే పరమాత్మ విషయంలో, **ఆదు మోర్ పఱ్ఱిలాద పావనై యదనై కూడిల్** = వేఱు దేనిలోను పోని అనన్యభక్తి కల్గితే, ( లేక ) వేఱు ఉపాయాలలో ఉండే సంబంధం అంతా వీడి, భగవంతునే ఉపాయంగా ఆశ్రయిస్తే – లేక, వేఱు దేనిలోను సంగంలేని భావన అనే అంతిమ స్మృతి కల్గితే, అతనిని (భగవానుని) పొందవచ్చు – అనేవి ఆ మూడర్థాలు. "ఉళ్ళాల్" – అనే పదంలోని "ఆల్" అనేది అవ్యయం.

పూర్వులు పల్కిన ఈ మూడర్థాలను శ్రీరామానుజులు విని, "ఈ దశకంలో

భగవానుడు సకల చేతనాచేతనాలలో అంతరాత్మగా నిలచి ఉన్నాడనే అర్థం అసకృత్ తెలుపబడింది. కనుక, దానికి తగినట్లుగా "అతడు వ్యాపించి ఉండే చేతనా చేత నాలలోని దోషాలు అతనికి సంక్రమించవు" – అనేది తప్పక చెప్పాలి. అందువల్ల మొదటి అర్థనిర్వాహమే ఇక్కడ స్వీకరించదగినది" – అని అన్నారు.

**"పావనై"** అనే పదానికి పూర్వులు పల్కిన మొదటి అర్థం ఏమంటే – భక్తి – అనేది – పరమాత్మను విషయంగా కల్గినది, ఫలసంగకర్తృత్వత్యాగాలతో కూడినదై, విజాతీయజ్ఞానసంబంధం ఏమాత్రం లేనిది, సజాతీయప్రత్యయం (జ్ఞానం) ప్రవాహరూపంగా ఉండేది, తైలధారవలె అవిచ్ఛిన్నమై, ధ్యానించేటపుడే **"సుఖం కర్తుమ్"** అనేవిధంగా అత్యర్థం ప్రియంగా ఉండేది, అయిన దర్శనసమాకారమైన భావన – అని. ఇదే నిదిధ్యాసనం. రెండవ అర్థంలో – ఉపాయాధ్యవసానమ్ – భగవంతుడే ఉపాయమనే నిశ్చయం. మూడవ అర్థం – స్మృతి – అంటే – అంతిమస్మృతి. ఈ మూడు అర్థాలు **"ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిధిధ్యాసితవ్యః"** అనే శ్రుతిని దృష్టిలో పెట్టుకొని చేయబడినదని చెప్పవచ్చు.

**ఆదు మోర్ పఱ్ఱిలాద పావనై** – అనేటపుడు (1) భక్తిపరమైన అర్థంలో – **ఆవి** – అంటే – ఆత్మ, **ఉయిర్** – పరమాత్మ. సదా ఆత్మతో చేరి ఉండే పరమాత్మ విషయంగా కైంకర్యం కంటే వేఱయిన ప్రయోజనాంతరాలలో దేనిలోను ఏ సంగం లేని తైలధారవలె అవిచ్ఛిన్నస్మృతి సంతానరూపమైన భక్తి ఆ ఆత్మకు ఉంటే పరమాత్మను చేరవచ్చునని శబ్దార్థం. (2) ప్రపత్తియోజనలో – ఉపాయాంతరాలలో దేనిలోను ఏ సంబంధం లేకుండా ఉండే భావన – అతడే ఉపాయమనే దృఢమైన నిశ్చయం కూడితే – అని అర్థం. (3) అంతిమస్మృతి పక్షంలో – **అవి శేర్ ఉయిరినుళ్ళాల్**– ప్రాణం, శరీరాన్ని విడచిపెట్టి ఆత్మలో చేరేటపుడు – అని, వానిలో, పరమాత్మలో చేరేటపుడు, **ఆదుమోర్ పఱ్ఱిలాద**– భగవంతుడు తప్ప వేఱు విషయాలు దేనిలోను ఏ సంగం లేని, **పావనై** = (భావన) అంతిమ స్మృతి కల్గితే – అని అర్థం. శ్రీరామానుజుల నిర్వాహంలో **"పావనై"** – అంటే – అనుసంధానం.

ఈ అర్థచతుష్టయంలో **"అదనై"** అంటే – ఆ ఆత్మలకు – అని అర్థం.

**"ఆవి శేర్ ఉయిర్"** – అనేటపుడు **"ప్రాణస్య ప్రాణమ్"** (కేనో–1–2) అనే శ్రుతి స్మరణీయం. ప్రాణాధారమైనవాడు పరమాత్మ – అనేటప్పుడు – **"యస్మిన్ ద్యౌః పృథివీ చాంతరిక్ష మోతం మన స్సహ ప్రాణై శ్చ సర్వై స్తమేవైకం జాన థాత్మానమ్"** అనే ముండకశ్రుతి (2–2–5) స్మరణీయం. **"న స్థానతోపి పరస్యోభయ లింగం హి సర్వత్ర"** అనే బ్రహ్మసూత్రం, **"అపేక్షితవిధే రనపేక్షితవిధానస్య దుర్బల త్వాత్"** (అపేక్షితమైన విధి కంటే అనపేక్షితమైన విధి దుర్బలమైనందున) అనే న్యాయం – శరీరగతమైన బాల్యాదులు జీవునకు సంక్రమించనట్లే, చేతనాచేతన గత స్వరూపస్వభావ వికారాలేవీ ఈశ్వరునకు అంటవు – అనే అర్థానికి అను గుణంగా స్మరణీయాలు. భక్తిపరంగా, ప్రపత్తిపరంగా, అంతిమ స్మృతిపరంగా – మూడర్థాలు తెల్పుతున్నపుడు ఈడులో **"ఇతుక్కు వేఱే ఇరణ్డు పొరుళ్"** అని అనడం ఏమి? అంటే – భక్తి ప్రపత్తులను రెండిటిని ఒకే వర్గంగా భావించి ఈ విధంగా రెండుగా చెప్పబడింది. పాశురంలోని **"పావనై అతనై"** అనే ప్రయోగంలో **"అతనై"** అనే పదాన్ని **"పావనై"** (భావన)కు విశేషణంగా చేసి, **"ఆ భావన"** – అనే అర్థం కూడా కొన్ని ప్రతులలో ఉన్నట్లు జీయర్ అరుంబద వివరణంలో సూచింపబడింది.

ఇరుపత్తు నాలాయిరప్పడివ్యాఖ్యలో కూడా మిగిలిన మూడు నిర్వాహాలతో పాటు శ్రీరామానుజుల నిర్వాహం **"సర్వాత్మభావమ్, శొల్లి నిత్తైయాలే అవ*గ్ర్గ్రి*న్ పక్కల్ దోషమ్ తట్టాదానొరువన్ – ఎన్నుమిడమ్ శొల్లవేణుమ్. అ*గ్ర్గై* చ్చొల్లుకిఱదు – ఎన్ఱు ఎమ్బెరుమానార్"** అని ప్రస్తావింపబడింది. ఆఱాయిరప్పడి ఒన్బదినా యిరప్పడి, పన్నీరాయిరప్పడి వ్యాఖ్యలలో శ్రీరామానుజ నిర్వాహానుసారంగానే వివరింపబడింది.

ఈ దశకంలో ప్రారంభంనుండి భగవానుని సర్వాత్మభావం **"పుక*ళ్ళు*నల్ ఒరువన్ ఎన్గో!"** ఇత్యాదిగా అనుసంధింపబడింది, అందువల్ల శ్రీరామానుజుల నిర్వాహం దశకప్రమేయం అంతటికీ సమన్వయిస్తుంది. కనుక ప్రకరణాను గుణం కూడా యుక్తతరం. అంతేకాక, విశిష్టాద్వైతసిద్ధాంత ప్రధానప్రతితంత్రార్థమైన శరీరాత్మ భావానికి కూడా అనుగుణం.

**(8) (3–6–6) ఈడు వ్యాఖ్య**

**(అడిక్కీ*ఏ్ర్* పుకనిన్ఱ శెఙ్గణ్ మాల్) – "హిరణ్యన్ పక్కల్ శీ*గ్ర్ఱ* – ముమ్ శెల్లానిఱ్క, శ్రీప్రహ్లాదా*ఏ్ర్*వానుక్కు క్కిట్టలాయిరున్దపడి ఎఙ్గనే?" ఎన్ఱు ఎమ్బెరుమానారై చ్చిలర్ కేట్క, "సింహమ్ ఆనైమేలే శీఱినాలుమ్ కుట్టిక్కు ములై యుణ్ణలామ్పడి యిరుక్కుమితే" ఎన్ఱరుళిచ్చెయ్‌దార్. "ఆశ్రితవాత్సల్యత్తాలే అవర్‌కళ్‌విరోధికళ్ మేలే శీఱిన శీ*గ్ర్ఱ*మానాల్, పిన్నై అవర్‌కళుక్కు అణైయ ఒణ్ణాదపడి యిరుక్కుమో!" ఎన్ఱరుళిచ్చెయ్ దార్.**

**(అడిక్కీ*ఏ్ర్* పుకనిన్ఱ శెఙ్గణ్ మాల్)** – నృసింహునకు హిరణ్యకశిపునిపట్ల కోపం కొనసాగుతూ ఉండగానే, శ్రీప్రహ్లాదా*ఏ్ర్*వాన్‌కు దరిచేరడానికి వీలు అయేటట్లు ఆ స్వామి ఉండే రీతి ఏమి?" అని కొందఱు శ్రీరామానుజులను ప్రశ్నించగా, "సింహం, ఏనుగుపై కోపించినా, అది తన బిడ్డ తనవద్ద పాలు తాగడానికి వీలుగా కదా ఉంటుంది!" అని సమాధానమిచ్చారు. "ఆశ్రితుల పట్ల గల వాత్సల్యంతో వారి శత్రువులపై కోపిస్తే, వారికి (భక్తులకు) తన దరిచేదడానికి సాధ్యం కాకుండా ఉంటుందా?" అనికూడా అన్నారు.)

**"శీ*గ్ర్ఱ*త్తోడు అరుళ్ పెఱ్*గ్ర్ఱ*వన్ అడిక్కీ*ఏ్ర్* పుకనిన్ఱ శెఙ్గణ్‌మాల్"** (కోపంతో ఉండేటపుడే, కృపను పొందిన ప్రహ్లాదుడు తన పాదాల చెంతకు వచ్చి ఆశ్రయించేటట్లుగా ఉండే ఎఱ్ఱని కన్నులను కలవాడు) అనే ఆ*ఏ్ర్*వార్ల శ్రీసూక్తిని వ్యాఖ్యానిస్తూ నమ్పిళ్ళై, శ్రీరామానుజులకు సంబంధించిన ఒక సంవాదాన్ని (సంభాషణను) ఉదాహరించారు.

"హిరణ్యకశిపునిపట్ల కోపాన్ని కల్గి ఉండేటపుడే, ప్రహ్లాదునకు దరిచేరడానికి వీలుగా ఏవిధంగా నృసింహస్వామి ఉన్నాడు?" అని కొందరు శ్రీరామానుజులను అడిగారు. అపుడు శ్రీరామానుజులు ఒక చక్కని లౌకిక దృష్టాంతాన్ని ఉదాహరించి వివరిస్తూ", సింహం ఏనుగు మీద కోపించిన సమయంలోనే తన బిడ్డను లాలించి పాలు ఇస్తుందికదా. భక్తుడైన ప్రహ్లాదునిపట్ల ఉండే వాత్సల్యంవల్లకదా నృసింహ స్వామి హిరణ్యునిపట్ల కోపాన్ని పొందాడు. అందువల్ల ప్రహ్లాదునకు దరిచేరడానికి వీలు కాకుండా ఆ స్వామి ఉంటాడా?" అని అన్నారు. కోపానికి విషయం హిరణ్యుడు, వాత్సల్యానికి విషయం ప్రహ్లాదుడు కనుక విషయభేదంవల్ల

విరోధం లేదని భావం.

తిరుప్పావై 22వ పాశురంలోని **"ఎజ్గళ్ మేల్ నోక్కుదియేల్"** అనే ప్రయోగాన్ని ఆఱాయిరప్పడి వ్యాఖ్యలో వివరిస్తూ నాయనార్ పై సంవాదాన్ని భట్టర్ పల్కినట్లుగా తెలిపారు. ఈ వక్తృ భేదాన్ని పూర్వాచార్యుల ఐకకంఠ్యంతో సమన్వయించ వచ్చు. అంటే – శ్రీరామానుజులు పల్కిన అర్థాన్నే తరువాత భట్టర్ కూడా పలికారని భావించవచ్చు.

ఆழ్వార్ల శ్రీ సూక్తిలోని **"శీఱ్ఱత్తోడు అవనొరు మూర్త్తియాయ్"** అనే దానికి – కోపం మూర్తీభవించినట్లుగా ఉన్నదని భావం. **"మాల్"** – అంటే – పరత్వం – అని, ఆశ్రిత వ్యామోహం – అని రెండర్థాలు. మొదటి అర్థం హిరణ్యునిపట్ల, రెండవ అర్థం ప్రహ్లాదుని పట్ల అన్వయిస్తుంది. ఆ విధంగానే, **"శెజ్గణ్"** అంటే – ఎఱ్ఱని నేత్రాలను కలవాడని అర్థం. నేత్రాలలోని ఎఱ్ఱదనంకూడా కోపంవల్ల, వాత్సల్యం వల్ల కల్గుతుంది కనుక, ఈ విశేషణం హిరణ్యుని విషయంలో, ప్రహ్లాదుని విషయంలో సార్థకం. నృసింహస్వామి యొక్క కోపాతిశయాన్ని పొయ్కై ఆழ్వార్లు వర్ణిస్తూ **"పూమ్కోదైయాళ్ వెరువ పొన్ పెయరోన్ మార్వు ఇడన్ద"** (లక్ష్మీదేవికూడా భీతిల్లేటట్లు ఉన్నది) అని అన్నారు కదా! భాగవతాది పురాణాలలో కూడా నృసింహుని కోపాతిశయాన్ని చూచి బ్రహ్మాదులే కాక, లక్ష్మీదేవిసైతం దరిచేరడానికి భయపడగా, ప్రహ్లాదుడు సమీపించి ఆ స్వామిని ప్రార్థించి ప్రసన్నుడయేటట్లు చేసికొన్నాడని తెలుపబడింది. అందువల్ల ఆழ్వార్ల సూక్తి ఈ పౌరాణిక సందర్భాన్ని స్మరింపచేస్తున్నది అని కూడా చెప్పవచ్చు.

**(9) (3-6-8) ఈడు**

**ఎమ్బెరుమానార్ తిరువారాధనమ్ పణ్ణిప్పోరువతు ఒరు పిళ్ళైయితే. ఇజ్గనే యిరుక్కచ్చెయ్‌దే, ఒరునాళ్, ఒరు శ్రీవైష్ణవర్ చక్రవర్తి తిరుమకనై ఎழுన్దరుళప్పణ్ణి క్కొణ్డువన్దు కొడుత్తారాయ్, అవరై ప్పార్త్తు "ఇన్ద – మామేకం శరణం వ్రజ – ఎన్ఱు తేవై యిడాదార్ ఎழுన్దరుళినార్ – ఎన్ఱారామ్.**

(శ్రీరామానుజులు వెన్నముద్ద కృష్ణుని అర్చామూర్తికి తిరువారాధనం చేస్తూ ఉండేవారు. ఒకనాడు, ఒక శ్రీ వైష్ణవుడు శ్రీరామచంద్రమూర్తి అర్చామూర్తిని తీసికొని

వచ్చి, వారికి సమర్పించారు. ఆ మూర్తిని చూచి – **"మామేకం శరణం వ్రజ"** అనే నియమాన్ని పెట్టని ఈ శ్రీరాముడు వేంచేశాడు కదా! అని అన్నారట )

**"తయరతఙ్కుమకన్‌తన్నై యన్ఱి మఱ్ఱిలేన్ తఞ్జమాకవే"** (దశరథ పుత్రుని తప్ప వేఱొకనిని ఆపద్రక్షకునిగా కల్గినవారం కాము) అనే నమ్మాళ్వార్ల శ్రీసూక్తిని వివరించే నమ్బిళ్ళై, అన్యావతారాలలో ఆకృష్టులైనవారు కూడా శ్రీరామావతారంలో ఆసక్తులవుతారు – అనే విషయాన్ని తెల్పుతూ, దానికి ఉదాహరణగా శ్రీరామానుజులకు చెందిన ఒక ఐతిహ్యాన్ని ప్రస్తావించారు.

శ్రీరామానుజుల తిరువారాధనలోని అర్చామూర్తి వెన్నముద్ద ( దోగాడే ) కృష్ణుడు. ఒకనాడు ఒక శ్రీవైష్ణవస్వామి శ్రీరామచంద్రమూర్తి అర్చామూర్తిని తీసికొని వచ్చి శ్రీరామానుజులకు ఇచ్చారు. అపుడు శ్రీరామానుజులు – "శ్రీకృష్ణుడు" శరణాగతికి **"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ"** – అని ధర్మాలను అన్నిటిని విడచి నన్ను ఒక్కనే శరణుపొందు – అనే ఒక నియమాన్ని పెట్టాడు. అయితే శ్రీరాముడు మాత్రం అటువంటి ఏ నియమాన్ని పెట్టకుండా **"మిత్రభావేన సంప్రాప్తం నత్య జేయం కథంచన"** (మిత్రభావంతో నా దగ్గరకు వచ్చినవానిని ఏ రీతిలోను విడచి పెట్టను) అని అన్నాడు. ఇటువంటి ఏ నియమాన్ని పెట్టని శ్రీరాముడు వేంచేశాడు– అని చమత్కారంగా పలికారట.

**"మామేకం శరణం వ్రజ"** అనేది అప్రతిషేధమే కదా! ఇదికూడా ఒక విధిగా పరిగణించవచ్చునా? అంటే, ఆ అభిముఖ్యం కూడా, జీవుని చూస్తే, పరమ భక్తివలె దుర్లభంగాకదా కన్పిస్తుంది. "జీవునిలో అభిముఖ్యం తప్ప, అంతకు మించి ఏమీ అక్కరలేదు" అని పలికేది అంతా భగవంతుని సౌలభ్యగుణాన్ని దృష్టిలో పెట్టకొని చెప్పబడింది. నిజానికి, శరణాగతునిగూర్చి చెప్పేటపుడు **"మహా విశ్వాస పూర్వకమ్ ప్రార్థనామతిః"** అని విధించవలసినట్లుగా ఉంటుంది కదా!

**"తేవై"** – అంటే – దుశ్శక విధానం – ఆచరించడానికి కష్టంగా ఉండే విధానం – అని ప్రకృతంలో అర్థం.

### (10) (3–7) ఈడువ్యాఖ్యాన ప్రవేశం

**"తద్భక్తైర్వా సమాగమః" ఎన్ఱ విడత్తిల్ "వా" ఎన్ఱతై అవధారణత్తిలే యాక్కి,**

**"ఉద్దేశ్యన్దానే ఇజ్జే సిద్ధక్కుమ్‌కాణ్" ఎన్ఱు ఎమ్బెరుమానార్ అరుళిచ్చెయ్‌ద వార్‌త్తై".**

(**"తద్భక్తైర్వా సమాగమః"** – అనేచోట **"వా"** అనే దానిని అవధారణార్థకంగా గ్రహించి, ఉద్దేశ్యం ఇక్కడ సిద్ధిస్తుంది సుమా! – అని శ్రీరామానుజులు అర్థం చెప్పారు.)

తిరువాయ్‌మొழ்రి లోని **"పయిలుమ్ శుడరొళి"** (3-7) అనే దశకానికి ప్రవేశాన్ని అనుగ్రహించే నమ్బిళ్ళై భాగవతశేషత్వవిషయంలో శ్రీ రామానుజులు పల్కిన ఒక వార్తను ప్రస్తావించారు.

**"సంసారవిషవృక్షస్య ద్వే ఫలే హ్యమృతోపమే, కదాచిత్ కేశవే భక్తిః తద్భక్తైర్వా సమాగమః"** (సంసారమనే విషవృక్షానికి అమృతంవంటి రెండు ఫలాలున్నాయి. అవి ఏవి? అంటే, కదాచిత్తు కేశవుని విషయంలో భక్తి ఒకటి. ఆ కేశవుని భక్తులతోనే సమాగమం ఇంకొకటి) అనేది ఒక సంస్కృతచాటువు. ఈ శ్లోకాన్ని శ్రీరామానుజులు భాగవతశేషత్వమే పరమపురుషార్థమనే విషయానికి ప్రమాణంగా ఉదాహరిస్తూ వివరించారు. మేల్‌నాడులో (తిరునారాయణపురంలో) కేశవదీక్షితులనే వారి ఇంటిలో వేంచేసి ఉండగా శ్రీరామానుజులు ఈ శ్లోకాన్ని వివరిస్తూ ఇందులో అపూర్వమైన ఒక అర్థాన్ని పల్కినట్లు నమ్బిళ్ళై తెలిపారు.

ఈ క్రూరమైన సంసారంలో భగవద్భక్తి అనేది ఏదో ఒక సమయంలో కల్గుతుంది. దానికి మించి, ఒకానొకప్పుడు దుర్ఘటనమైన సమాగమమే కల్గుతుంది – అనేది ఆ అపూర్వార్థం.

**"కదాచిత్ కేశవే భక్తిః తద్భక్తైర్వా సమాగమః"** – అనేది చాటువు. దీనిలో **"వా"** అనే అవ్యయాన్ని సాధారణంగా **"లేక"** – అనే వికల్పార్థకంగా గ్రహిస్తారు. ఆ విధంగా గ్రహిస్తే, కేశవుని పట్ల భక్తిగాని, లేక, అతని భక్తులతో సమాగమం గాని – అనే అర్థం వస్తుంది. ఈ అర్థంలో రెండు కొఱతలున్నాయి. "ఇదిగాని, లేక, అదిగాని" అని అంటే, ఏదో ఒకటి మాత్రమే ఏర్పడుతుంది – అనే అర్థం వస్తుంది. అయితే, శ్లోకంలో **"ద్వే ఫలే"** అని రెంఢు ఫలాలు కల్గుతాయని చెప్పబడింది. కనుక ఆ అర్థం చెప్పడం పొసగదు. అంతేకాక, భగవద్భక్తి కంటే భాగవత భక్తి

అభ్యర్థితమనే (గొప్పదనే) అర్థం కూడా స్ఫురించదు. అందుచేత, **"వా"** అనే పదానికి **"ఏవ"** అనే అర్థంకూడా ఉన్నది కనుక, దానిని గ్రహించి, "ఒకానొక సమయంలో భగవద్భక్తి కల్గుతుంది, ఆ పిమ్మట అంతకు మించి, అంతకంటే గొప్పదైన భాగవత భక్తియే సిద్ధిస్తుంది. ఈ ఉద్దేశ్యమే – భాగవత సమాగమమే – సిద్ధిస్తుంది" – అని శ్రీరామానుజులు సరసంగా అర్థాన్ని పలికారు. ఇక్కడ ఆ "ఉద్దేశ్యమే" – అంటే – అరుదైనది, లభించడానికి అరుదైన ఏదో, అదే సిద్ధిస్తుంది – అనేది తాత్పర్యం. అరుంబద వివరణంలో కూడా **"ఏవకారద్యోత్య ద్యోతకమాయ్క్కొణ్డు, ప్రసిద్ధాభ్యర్థిత దుర్లభ జ్ఞాపక మెన్టపడి"** (ఏవకారం ద్వారా స్ఫురించే అర్థాన్ని స్ఫురింపజేసేదై, ప్రసిద్ధమైన, ప్రధానమైన, దుర్లభమైన భాగవత శేషత్వాన్ని తెల్పుతుంది – **"వా"** అనే అన్వయం) అని వివరింపబడింది. అందువల్ల **"కేశవేభక్తిః కదాచిత్ తద్భక్తై స్సమాగమ ఏవభవతి"** – ఒకానొకప్పుడు, కేశవభక్తి ఆ స్వామి భక్తుల సమాగమంగా సిద్ధిస్తుంది – అని తాత్పర్యం.

ప్రభువును చూడగోరి వెళ్ళినవారికి ఒకప్పుడు ప్రభువులకు ఇష్టులైనవారి, మంత్రులు, ఆంతరంగికులవంటివారి పరిచయం కల్గవచ్చు. వారిద్వారా దుర్లభ మైన, అభ్యర్థితమైన రాజదర్శనం లభిస్తే లభించవచ్చు. ఒకవేళ నేరుగా రాజదర్శనమే లభిస్తే ఇక చెప్పవలసినది లేదు కదా! **"రాజైవ దృష్టః"** ఇత్యాది లౌకిక ప్రయోగాలు ఇక్కడ ఉదాహరణాలు. ఇక్కడ రాజు స్థానంలో భాగవతులను, రాజ దర్శనానికి సహాయపడే వారి స్థానంలో భగవంతుని చెప్పాలి.

వికల్పం గ్రహిస్తే **"ద్వే ఫలే"** అనేది కుదరదు. సముచ్చయం గ్రహిస్తే **"కదాచిత్"** అనే పదప్రయోగం కుదరదు. అందువల్ల **"ఏకవృంతగత ఫలద్వయ"** (ఒకే గుత్తికి ఉండే రెండు ఫలాల) న్యాయంలో ఇక్షుకాండ పర్వన్యాయంలో అర్థాన్ని ఇక్కడ నిర్వహించాలి. ప్రాప్యంలో ప్రథమావధి భగవచ్ఛేషత్వమని, చరమావధి భాగవత శేషత్వమని తెలియాలి. ఒకే చెఱకు గడలోని రెండు కణుపుల వంటివే, ఇవి. అందువల్ల ఈ రెండు ప్రాప్యంలోని రెండుదశలు మాత్రమే తప్ప, వేఱు కాదు. అయితే భగవద్భక్తి అనేది ఆ స్వామికి గల పరత్వాన్ని చూచినందువల్ల కల్గిన భయం వల్లనే, సౌలభ్యాన్ని చూచినందువల్ల కల్గిన ప్రీతివల్ల కాని ఏర్పడవచ్చు.

కాని, మనవలెనే ఈ లోకంలో సంచరించే భాగవతుల పట్ల భక్తి కల్గడం చాలా అరుదు. వారు **"శిఋమామనిశర్"** (ఆకారంలో చిన్నవారైనా, మహిమలో గొప్పవారు) అనే విశ్వాసం కల్గడం దుర్లభం. పరత్వ భావన ఇంకా దుర్ఘటం. అందువల్ల అది అభ్యర్థితం. అది కల్గితే అరుదైన ప్రాప్యసిద్ధి కల్గినట్లే. **"జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్"** అన్నట్లు భాగవతులు భగవానునకు ఆత్మ స్థానీయులు కనుక, వారిపట్ల ఉండే భక్తి భగవద్భక్తి యొక్క పరిణత దశయే. ఈ విధంగా భగవద్భక్తి, భాగవత భక్తి – అనేది ఒకే గుత్తిలోని రెండు ఫలాల వంటివి. ఈ భావాన్ని ఈడులోని "ప్రాప్యత్తిల్ ప్రథమావధి – భగవచ్ఛేషత్వళవిలే నిత్తై. చరమావధి భాగవత శేషత్వళవిలేనిత్తై" (ప్రాప్యంలో మొదటిదశ భగవానునకు శేషమై ఉండడం, చరమ – చివరి – దశ భాగవతులకు శేషమై ఉండడం) అనే వాక్యం వివరిస్తున్నది. చెఱకు గడలోని కణుపులకు పర్వాలని పేరు. చెఱకు గడలోని మొదటి కణువు (పర్వం)లో తీపి తక్కువగా ఉంటుంది. అంతకంటే, చివరి కణువులో తీపి ఎక్కువగా ఉంటుంది. ఆవిధంగానే, భగవచ్ఛేషత్వంలోని మాధుర్యం కంటే భాగవత శేషత్వంలోని మధురిమ అధికం. ఎందుకంటే – అది భగవచ్ఛేషత్వ పురస్కృతమై ఉంటుంది కనుక. అందువల్ల, సంప్రదాయంలో భగవచ్ఛేషత్వానికి ప్రథమ పర్వమని, భాగవత శేషత్వానికి చరమ పర్వమని పేరు. ఈ వ్యపదేశంలో భాగవత శేషత్వంలో ఆచార్య శేషత్వం కూడా అంతర్భవిస్తుందని తెలియాలి. ఆచార్యులు కూడా భగవద్భక్తులే కదా. భాగవత శేషత్వాన్ని, ఆచార్య శేషత్వాన్ని మధ్యమ పర్వమని, ఆచార్య శేషత్వం చరమ పర్వమని చెప్పబడుతుంది. ఈ విధంగా పల్కడం – వారు చేసే ఉపకారాలలోని తారతమ్యాన్ని బట్టి, ఇక్కడ, ఏకవృంత గత ఫల ద్వయన్యాయం కంటే ఇక్షుకాండ పర్వన్యాయమే ఎక్కువ సరసం. ఎందుకంటే – ఒకే గుత్తిలోని రెండు ఫలాలు మాధుర్యంలో తౌల్యాన్ని కల్గి ఉండవచ్చు. అపుడు మాధుర్యంలో తారతమ్యాన్ని కల్గిన ప్రథమ – చరమ పర్వాలకు అవి దృష్టాంతం కాలేవు.

భగవద్రామానుజులు చూపిన భాగవత శేషత్వం యొక్క అభ్యర్థితత్వం – ఈడు వ్యాఖ్యలో నమ్పిళ్ళై **"ఎమ్మై ఆళుమ్ పరమరే"** (మమ్ములను దాసులుగా గ్రహించే స్వాములు) అనే మొదటి పాశురంలోని చివరి ప్రయోగాన్ని వ్యాఖ్యానిస్తూ – **"మున్బు అవనై – పరమన్ ఎన్ఱీర్. ఇజ్గె ఇవర్కళై – పరమర్ – ఎన్డానిన్ఱీర్.**

**ఇదిరుక్కుమ్బడి ఎన్? ఎన్నిల్, అనుభావ్యగుణత్తాలే శౌల్లిగ్రు, అఙ్గు. ఇఙ్గు అగ్గుణత్తుక్కు తోగ్రు వర్కళై చ్చొల్లుకిఱదు"** (పూర్వం భగవంతుని శేషి అన్నారు. ఇక్కడ భాగవతు లను శేషిభూతులంటున్నారు. ఈ రెండు ఏవిధంగా పొసగుతాయి? అంటే, భగవద్విషయంలోని శేషిత్వం అనుభవించే కల్యాణగుణాల ఆధిక్యంతో చెప్పబడింది. ఇక్కడ, ఆ గుణాలకు జితులైన భాగవతుల శేషిత్వం చెప్పబడింది) అని అనడం, నీటిని వివరించే అరుంబదరిలో – **"ఇత్తాల్ – భగవచ్ఛేషత్వమ్ గుణకృతమ్, భాగవత శేషత్వం స్వరూప ప్రయుక్త మెన్ఱు కరుత్తు"** అని విశదీకరించడం వల్ల వ్యక్తమవుతున్నది.

మతి, భాగవత శేషిత్వం స్వరూప ప్రయుక్తమని అంటే, భగవానుడే నిరుపాధిక శేషి – అనే వైదికసిద్ధాంతానికి భంగం రాదా! – అనే సందేహం ఇక్కడ కలుగవచ్చు. ఇక్కడ ప్రకరణం – భాగవత శేషిత్వ వైభవ వర్ణనం కనుక, ఇది అంతా చెప్పబడింది. కనుక **"న హినిందాన్యాయం"**లో ప్రకృతార్థాన్ని గ్రహించాలి. అంతే కాక, **"జ్ఞానీత్వాత్మైవ మే మతమ్", "భక్తాస్తేతీవ మే ప్రియాః"** ఇత్యాది భగవదభిమతాను సారంగా భాగవత శేషిత్వ శరణ్యత్వాదివైభవం ప్రకృతంలో కీర్తింపబడిందని కూడా గ్రహించడంలో అడ్డులేదు. **"ఉద్దేశ్యన్దానే ఇజ్జే సిద్ధిక్కుమ్కాణ్!"** అనే శ్రీరామానుజుల సూక్తితాత్పర్యం ఇదే. **"వా"** అనే పదానికి ఏవకారార్థం ప్రయోగంలో ఉన్నదనే విషయాన్ని **"స్యురేవతు పున ర్వైవేత్యవధారణవాచకాః"** అనే నామనిఘంటు వచనం ప్రమాణీకరిస్తున్నది. ఈ ఐతిహ్యం తిరువిరుత్తమ్ – 15వ పాశురానికి స్వాపదేశ వ్యాఖ్యానంలో కూడా ప్రస్తావింపబడింది.

## (11) (3 – 7) – ఈడు ప్రవేశం

**"గచ్ఛతా" – ఇదుక్కు ఎమ్బెరుమానార్ – "పయిలుమ్ శుడరొళి" యిలుమ్, "నెడుమాఱ్కడిమై" యిలుమ్ శొల్లుకిఱ అర్థత్తై శ్రీశత్రుఘ్నాழ్వాన్ అనుష్ఠిత్తు క్కాట్టినాన్"– ఎన్ఱు అరుళిచ్చెయ్‌వర్.**

(**"గచ్ఛతా"** – దీనికి శ్రీరామానుజులు – **"పయిలుమ్ శుడరొళి"** దశకంలో, **"నెడుమాఱ్కడిమై"** దశకంలో చెప్పబడే అర్థాన్ని శ్రీశత్రుఘ్నాழ్వాన్ అనుష్ఠించి చూపించారు" – అని పలికారు )

**"పయిలుమ్ శుదరొళి"** అని ప్రారంభమయే తిరువాయ్‌మొ*ళ్ళి* దశకంలో ఆ*ళ్ళ్వా*ర్లు భాగవత వైభవాన్ని కీర్తించారు. ఈ దశకానికి ప్రవేశాన్ని అనుగ్రహించే నమ్బిళ్ళై, శ్రీరామానుజులు పల్కిన ఒక సూక్తిని ఉదాహరించారు.

**"పయిలుమ్ శుదరొళి"** (3-7) అని ఆరంభమవుతున్న దశకంలో, **"నెడుమాఱ్కడిమై"** (8-10) అని ఆరంభమయే దశకంలో నమ్మా*ళ్ళ్వా*ర్లు భగవద్భక్తులే ఆశ్రయణీయులని పలికారు. "ఈవిధంగా నమ్మా*ళ్ళ్వా*ర్లు పల్కిన విషయాన్ని శ్రీరామాయణంలోని శ్రీశత్రుఘ్నా*ళ్ళ్వా*న్ అనుష్ఠించి చూపారు – అని శ్రీరామానుజులు అన్నారు.

వాస్తవంలో – "అందువల్ల తిరువాయ్‌మొ*ళ్ళి*లోని అర్థాన్ని శత్రుఘ్నా*ళ్ళ్వా*న్ ఆచరించి చూపించారు" – అనేది పొసగదు కదా! ఎందుకు? అంటే, శ్రీరామాయణానికి చాలాకాలం తరువాత తిరువాయ్‌మొ*ళ్ళి* అనుగ్రహింపబడింది. అయితే, భాగవతశేషత్వ వైభవమనేది శ్రీరామాయణంలోనే కాదు, వైదికమైన తిరుమంత్రంలోనే వ్యక్తమవుతున్నది. **"నిన్ తిరువెట్టె*ళ్ళు*త్తుమ్ క*ఱ్ఱు* నాను*ఱ్ఱ*దు ఉన్నడియార్ క్కడిమై"** (నీ అష్టాక్షరిని అభ్యసించిన నేను గ్రహించినది– నీ దాసులకు దాసుడనై ఉండాలని) అని తిరుమంగై మన్నన్ ఈ అంశాన్ని గూర్చి పలికారు. ఈ విధంగా అష్టాక్షరీ మంత్ర సిద్ధమైన భాగవత శేషత్వాన్ని అనుసరించి శత్రుఘ్నా*ళ్ళ్వా*న్ అనుష్ఠించగా, నమ్మా*ళ్ళ్వా*ర్లు దానినే తమ ప్రబంధంలో పలికారని వ్యాఖ్యాత వివరణం తాత్పర్యం. అష్టాక్షరిలోని ప్రణవం భగవానుని సర్వశేషిత్వాన్ని, నమ పదం సర్వశరణ్యత్వాన్ని, **"నారాయణాయ"** అనే పదం సర్వప్రాప్యత్వాన్ని తెల్పుతున్నాయి. ఇది ప్రథమ పర్వంలోని అర్థత్రయం. దీనివల్ల భాగవత శేషిత్వం, భాగవత శరణ్యత్వం, భాగవత ప్రాప్యతం అర్థాత్సిద్ధిస్తాయి. ఈ మూడిటిలో భాగవత శేషిత్వ, శరణ్యత్వాలు **"పయిలుమ్ శుదరొళి"** దశకాలలో ప్రాప్యత్వం **"నెఱుమాఱ్కడిమై"** (8-10) దశకంలో తెలుపబడ్డాయని తెలియాలి. **"కయిలుమ్ శుదరొళి"** దశకంలోని **"ఎమ్మై యాళుమ్ పరమరే"**, **"ఎమ్మై యాళుదై నాతరే"**, **"ఎమ్మై యాళుడైయార్‌కళే"**, **"ఎమక్కుమ్ పెరుమక్కళే"**, **"నమ్మై యళిక్కుమ్ పిరాక్కళే"**, ఇత్యాది సూక్తులలో భాగవత శేషిత్వ– శరణ్యత్వాలు తెలుపబడ్డాయి. **"నెడుమాఱ్కడిమై"** దశకంలోని **"శిఱుమా మనిశరాయ్**

**ఎన్నై ఆణ్డార్"** (ఆకారంలో చిన్నవారైనా, మహిమలో గొప్పవారై, నన్ను యథేష్టంగా వినియోగించుకొనే వారు), **"అవనడి యార్ ననిమాక్కలవి యిన్బమే నాళుమ్ వాయ్క్క"** (ఆ భగవానుని భక్తులలో చాలా గొప్పదైన సంశ్లేష గుణమే ప్రతిదినం కలగాలి) ఇత్యాది ప్రయోగాలు భాగవత ప్రాప్యత్వాన్ని తెల్పుతున్నాయి. ఈ భాగవత శేషిత్వ – శరణ్యత్వ – ప్రాప్యత్వాలనే మూడు జీవుని భాగవత శేషత్వ, పారతంత్ర్యాలను సారంగా తెల్పుతున్నాయని గ్రహించాలి.

ఈ శేషత్వ, పారతంత్ర్యాలను శత్రుఘ్నాళ్వాన్ ఆచరించి చూపించారు. ఆ విషయాన్ని శ్రీరామాయణంలోని **"గచ్ఛతా మాతులకులమ్"** ఇత్యాది శ్లోకం తెల్పు తున్నది అని శ్రీరామానుజుల సూక్తి. దీనిని నమ్బిళ్ళై తమ ఈడు వ్యాఖ్యలో ఈ శ్లోకంలోని ప్రతిపదాన్ని వివరిస్తూ నిరూపించారు.

మర్యాదా పురుషోత్తముడుగా చెప్పబడే శ్రీరామాది రూపంలోని అవతారాలు– సామాన్య, విశేషధర్మాలను స్వయంగా ఆచరించి చూపించి, తద్వారా ధర్మసంస్థాపన చేయడం కోసం ఎత్తిన అవతారాలు. వీటిలో, శ్రీరాముడు పితృవాక్య పరిపాలన మనే సామాన్య శేషత్వ ధర్మాన్ని ఆచరించి, సంస్థాపించడం కోసం అవతరించాడు. లక్ష్మణుడు, ఈ శేషత్వం ప్రాప్త విషయంలో – అంటే – నిరుపాధికపిత అయిన భగవానుని విషయంలో చేయదగినది – అనే విశేషధర్మాన్ని అనుష్ఠించి చూపాడు. ఆ విధంగా చేసే కైంకర్యం భగవానుని అభిమతాను సారంగా చేయాలనే పారతంత్ర్య మనే విశేషధర్మాన్ని భరతాళ్వాన్ అయోధ్యలో నిలచి ఉండడం ద్వారా అనుష్ఠించి చూపించాడు. ఈ శేషత్వ, పారతంత్ర్యాలు రెండు భాగవత పర్యంతంగా అనుష్ఠించా లనే ఉత్తమ విశేషధర్మాన్ని శత్రుఘ్నాళ్వాన్ అచరించి చూపాడు. ఈ శత్రుఘ్నాళ్వాన్ ఆచరించి చూపిన ఈ విశేషధర్మాన్ని **"గచ్ఛతా"** ఇత్యాది శ్రీరామాయణ శ్లోకం తెల్పుతున్నది. **"గచ్ఛతా మాతులకులం భరతేన తదానఘః, శత్రుఘ్నో నిత్య శత్రుఘ్నో నీతః ప్రీతిపురస్కృతః"** (మాతులకులం గచ్ఛతా భరతేన నీతః) – భరతునకు మేనమామ ఇంటికి వెళ్ళడం ఉద్దేశ్యం. శత్రుఘ్నునకు భరతుని వెంట వెళ్ళడం ఉద్దేశ్యం. భరతుని మేనమామ అయిన యుధాజిత్తు పిలిపించి భరతుని మాత్రమే కదా! (గచ్ఛతా) – "వెడుతున్న" అనే ఈ వర్తమానకాలికపదం ద్వారా – శత్రుఘ్నుని

తనవెంట తీసికొనిపోయే క్షణానికి ముందు క్షణంలో భరతునకు అతనిని తన వెంట తీసికొని పోవాలనే అభిప్రాయం లేదు, శ్రీరామునకు విన్నపించలేదు, దశరథుని ఆజ్ఞను పొందలేదు – అని స్ఫురిస్తుంది. దీనివల్ల శత్రుఘ్నుని మమతా నివృత్తి తెలుపబడింది.  అహంకార, మమకారాలు రెండు శేషత్వ విరోధులు కదా!

**(భరతేన)** – శ్రీరాముడు రాజ్యాన్ని వదలిపెట్టివెళ్ళాడు. లక్ష్మణుడు అతని వెంట వెళ్ళాడు. దశరథ చక్రవర్తి మరణించాడు. శత్రుఘ్నుడు తనను (భరతుని) తప్ప ఇంకొకరిని తెలియడు. అందుచేత, శ్రీరామునకు చెందిన రాజ్యాన్ని భరతుడు భరించినందున **"భరత ఇతి రాజ్యభరణాత్"** అనే విధంగా భరతుడు సార్థక నాముడయ్యాడు.

**(తదా)** అపుడు ఆ సమయంలో – అని అర్థం. శత్రుఘ్నుడు కూడా రాజకుమారుడైనపుడు, అతడు పుట్టిన నక్షత్రం భరతుని జన్మ నక్షత్రం కంటే వేఱు అయినపుడు, తనకు శుభం కల్గించే మంచి నక్షత్రంలో కదా వెళ్ళాలి. ఆ విధంగా కాకుండా, భరతుడు ఎపుడు వెళ్ళాడో, ఆ నక్షత్రంలోనే తనకు ప్రయాణ ముహూర్తంగా వెళ్ళాడు. దీనివల్ల శత్రుఘ్నుని అహంకార నివృత్తి తెలుపబడింది. **(అనఘః)** పాపం లేనివాడని – అర్థం. ఆ రాజధానిలో మిగిలిన వారంతా పాపంతో కూడుకొన్న జీవనాన్ని సాగిస్తున్నారు కాబోలు. ఇక్కడ పాపం ఏమి? అంటే, రామభక్తి కూడా కల్గి ఉండడమే. రామభక్తి పాపమా? అంటే – పాపం కంటే పుణ్యమనేది ఉద్దేశ్యమైనా, పాపపుణ్యాలు రెండు మోక్ష విరోధులైనందున త్యాజ్యాలే కదా! **"తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ"** అని శ్రుతి కూడా పుణ్యపాప విధూననం మోక్షానికి ఆవశ్య మని అన్నది. ఆ విధంగానే ఇక్కడ కూడా రామభక్తి అనేది భరత కైంకర్యమనే ప్రయోజనానికి విరోధి కనుక పాపంతో సమానమే. రామభక్తి ఏవిధంగా ఉద్దేశ్య విరోధి? అంటే, ప్రథమపర్వమైన భగవద్భక్తిలో నిలువడం చరమపర్వమైన భాగవత కైంకర్యానికి అడ్డు కదా! అందువల్ల ఉద్దేశ్య విరోధియే)

**(శత్రుఘ్నః)** – పుట్టినపుడే "శత్రువులు మట్టికరచేటట్లు వర్ధిల్లుతాడు – అని తోచినందున వశిష్ఠ మహర్షి ఈ పేరు పెట్టాడు. ఇక్కడ శత్రువు ప్రాప్యవిరోధి అయిన భగవద్భక్తియే. **(నిత్యశత్రుఘ్నః)** – బాహ్యవిరోధులనే కాక, అంతః శత్రువు

లైన ఇంద్రియాలను జయించారు. దీని భావమేమంటే – జీవుల దృష్టిని, చిత్తాన్ని అపహరించే శ్రీరామసౌందర్యంలో దృష్టిపెట్టకపోవడమే. అయితే, **"నాహం స్వపిమి జాగర్మితమే వార్యం విచిం యతన్, ఇత్యేన మబ్రవీత్ భ్రాతా శత్రుఘ్నోభరత ప్రియః"** (నేను నిద్రపోవడం లేదు. మేల్కొని ఉన్నాను. ఆర్యుడైన ఆ శ్రీరాముని గూర్చి చింతిస్తున్నాను – అని భరతునకు ప్రియుడైన, భరతుని ప్రియమైనవానినిగా కలవాడైన, భరతుని సోదరుడైన శత్రుఘ్నుడు అన్నాడు) అని శ్రీరాముని గూర్చి శత్రుఘ్నుడు చింతిస్తూ ఉన్నట్లు తెలుస్తున్నదే! భక్తి అంటే – మహనీయుల పట్ల ప్రీతి కదా! కనుక ఇది రామభక్తి కదా! – అని అంటే, ఆ విధంగా శ్రీరాముని శత్రుఘ్నుడు భోగ్యబుద్ధితో చింతించడం కూడా భరతునకు ప్రీతికరమనే భావనతోనే. కనుక, అది ఉద్దేశ్యవిరోధి కాదు. పోనీ, **"అనఘః, నిత్యశత్రుఘ్నః"** అనే పదాలు పావనత్వ, భోగ్యత్వాలను తెల్పుతున్నదని చెప్పవచ్చు కనుక, భోగ్యత్వ బుద్ధితో కాకపోయినా, **"పావన స్సర్వలో కానాం త్వమేవ రఘునందన"** అని చెప్పబడిన శ్రీరాముని పావనత్వాన్ని చూచి అయిన శత్రుఘ్నుడతనిని చింతించి ఉండవచ్చు కదా! అంటే, "ఆ విధంగా కూడా లేదు" – అని **"అనఘః" "నిత్యశత్రుఘ్నః"** అనే పదాలు తెల్పు తున్నాయి. **"అనఘః"** అనే పదం శత్రుఘ్నుని దృష్టిలో – "పావనత్వంలో భరతునితో సాటిరాడు శ్రీరాముడు" అనే అర్థాన్ని, **"నిత్యశత్రుఘ్నః"** అనేపదం – "భోగ్యతలో భరతునితో శ్రీరాముడు సాటిరాడ"నే అర్థాన్ని తెల్పుతున్నవి కనుక, ఈ రెండిటిని భరతుని విషయంలోనే శత్రుఘ్నుడు కల్గి ఉన్నాడనే విషయాన్ని ఈ రెండు విశేషణాలు తెల్పుతున్నాయి. **"న హ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః, తేపునం త్యురుకాలేన దర్శనాదేవ సాధవః"** (జలంతో నుండే నదులు, సరస్సుల వంటివి, రాళ్ళతో, మట్టితో నిర్మింపబడే దేవతా విగ్రహాలు తీర్థాలు కావు. దర్శనమాత్రంతోనే పావనం చేసే ఆ సత్పురుషులే నిజమైన తీర్థాలు) అన్నట్లు పరమభాగవతుడైన భరతుని పావనత్వం సిద్ధం కదా! **(నీతః)** – భరతునితో పాటుగా శత్రుఘ్నుడు కూడా వెళ్ళాడు – అని అనకుండా ఒక అచేతన వస్తువు తీసికొని పోబడేటట్లు, భరతునిచే శత్రుఘ్నుడు తీసికొనిపోబడ్డాడు – అని ఈ పదం ద్వారా వ్యక్తమవు తున్నందున శత్రుఘ్నుని అత్యంత పారతంత్ర్యం స్ఫురిస్తున్నది. ఒక తవ్వుగోలను, కత్తిని తీసికొనిపోయేటట్లు, శత్రుఘ్నుని భరతుడు తీసికొని

పోయాడని దీని భావం. ఒక ద్రవ్యానికి ఇంకొక ద్రవ్యంతో సంయోగం కల్గితే, ఆ సంయోగం ఆ రెండు ద్రవ్యాలకు సంబంధించినదై ఉంటుంది కదా! ఆ విధంగా ఉభయ ప్రధానమైన సంయోగాన్ని కలవాడై శత్రుఘ్నుడు వెళ్ళాడా? అంటే, ఆ రీతిలో కాకుండా, తాను కూడా ఒక ద్రవ్యం (వస్తువు) అయినా, జాతిని గుణం విడచి ప్రత్యేకంగా ఉండలేని రీతిలో, సూర్యుని ప్రభ అనేది విడచి ప్రత్యేకంగా ఉండని రీతిలో, పుష్పాన్ని పరిమళం విడచి ఉండని రీతిలో అపృథిక్ సిద్ధసంబంధంతో అత్యంత పరతంత్రుడైన భరతునిచే తీసికొనిపోబడ్డాడు. దీని వల్ల శత్రుఘ్ననకు చరమ పర్వంలో గల అత్యంత పార తంత్ర్యం తెలుపబడింది. అహంతా మమతానివృత్తి రూపమైన, చరమ పర్వంలో శత్రుఘ్ననకు గల, అత్యంతశేషత్వం పూర్వమే తెలుపబడింది కదా!

**(ప్రీతిపురస్కృతః)** "అన్నగారిని అనుసరించాలి" – అనే విధిని అనుసరించాలి – అనే భావనతో వెళ్ళాడా? అంటే, కాదు. రాజధానిలో ఉండేటపుడు తాను ఒక్కటే కాక, పలువురితో కలసి భరతుని కైంకర్యం చేయవలసిన స్థితి ఉంటుంది. ఇది, ఒకడు భుజించే అన్నాన్ని పలువురి పంచుకొని భుజించడం వంటిది. ఆ విధంగా కాక, భరతునితో ఏకాంతంలో ఉంటే నేను అన్ని విధాలైన కైంకర్యాలను భరతునకు చేయగలను కదా! – అనే ప్రీతి ఆకర్షించి వెళ్ళాడు. లక్ష్మణుడు కూడా **"అహం సర్వం కరిష్యామి"** – నేను అన్ని కైంకర్యాలను చేస్తాను – అని ఏకాంతంలో శ్రీరామునకు అన్ని సేవలు చేయవచ్చుననే ఆశతో పోవడంవంటిదే ఇది కూడా. లక్ష్మణుని నిష్ఠ ప్రథమ పర్వంలోనిది కాగా, శత్రుఘ్నుని నిష్ఠ చరమపర్వంలోనిది. ఈ విధంగా **"గచ్ఛతా"** ఇత్యాది శ్రీరామాయణ శ్లోకం శత్రుఘ్ననకు చరమ పర్వంలో కల శేషత్వ, పారతంత్ర్యాల పరాకాష్ఠను తెల్పుతున్నది – అని శ్రీరామానుజులు అభిప్రాయం.

ముముక్షుప్పడి గ్రంథంలో శ్రీపిళ్ళైలోకాచార్యులవారు నమశ్శబ్దార్థాన్ని తెల్పుతూ **"ఇదిలే భాగవతశేషత్వ మనుసంధేయమ్, ఇత్తై అకారత్తిలే శొల్లువర్కళ్, ఉకారత్తిలేయుమ్ శొల్లువర్కళ్"** (ఇందులోని భాగవత శేషత్వాన్ని అనుసంధించాలి. దీనిని అకారంలోను పల్కుతారు; ఉకారంలోను పల్కుతారు) అని పల్కిన సూత్రాలు

ఇక్కడ స్మరణీయాలు.

**(12) (3-7) - ఈడు - ప్రవేశం**

**"ఎమ్బెరుమానార్ ఇశ్లోకత్తుక్కు వాక్యార్థమాక - "శ్రీశత్రుఘ్నాழ్వాన్ - పెరుమాళుక్కు నల్లనాన పడి - పెరుమాళై క్కాణ్డై క్కొణ్డు, పెరుమాళుక్కు నల్లనాన భరతాழ్వానై యల్లదు అఱియాదపడియానాన్" ఎన్ఱు అరుళిచ్చెయ్‌దార్.**

(శ్రీరామానుజులు ఈ శ్లోకానికి వాక్యార్థంగా - "శ్రీశత్రుఘ్నాழ్వాన్ - శ్రీ రామునకు ఇష్టమైన రీతి ఏమంటే - శ్రీరాముని కాదని, ఆ శ్రీరామునకు ఇష్టమైన భరతాழ్వాన్‌ను తప్ప వేఱొకరని తెలియని రీతిలో అయినాడు" అని పలికారు)

తిరువాయ్‌మొழి ప్రబంధంలోని **"పయిలుమ్ శుడరొళి"** అని ఆరంభ మవుతున్న దశకంలో భగవద్భక్తుల మహిమను ఆழ్వార్లు కొనియాడారు. ఈ సందర్భాన్ని వ్యాఖ్యానించే నమ్బిళ్ళై, శ్రీరామానుజులు పల్కిన ఒక సూక్తిని ప్రస్తావించారు. ఇది ఇక్కడే కాక కణ్ణినుణ్ శిఱుత్తామ్బు ప్రబంధానికి నమ్బిళ్ళై అనుగ్రహించిన వ్యాఖ్యానావతారికలో, పెరియవాచ్చాన్ పిళ్ళై అనుగ్రహించిన వ్యాఖ్యానావతారికలో కూడా గోచరిస్తున్నది.

శ్రీశత్రుఘ్నాழ్వాన్ శ్రీరాముని పూర్తిగా విడచి, భరతుని ఆశ్రయిస్తే, మఱి, **"కదాన్వహం సమేష్యామి భరతేన మహాత్మనా, శత్రుఘ్నేన చ వీరేణ త్వయా చ రఘునందన!"** (ఓ రఘువంశంలో పుట్టిన లక్ష్మణా! మహాత్ముడైన భరతునితో, వీరుడైన శత్రుఘ్ను నితో, నీతో నేనెపుడు కలువగలనో గదా) అనేవిధంగా శత్రుఘ్నుని పట్ల శ్రీరామునకు స్నేహం ఏ విధంగా కల్గింది? శత్రుఘ్నుడు శ్రీరామునిలో **"పావన స్సర్వలోకానామ్"** అనే రీతిలో పావనత్వం కల్గినవాడనే భావంతోనైనా చూపును సారించడం లేదే! భోగ్యత్వభావనతో అయినా దృష్టిని పెట్టడం లేదే! - అతివాదం ఏ విధంగా కుదురుతుంది?" అనే శంకకు సమాధానంగా శ్రీరామానుజులు పల్కిన సూక్తిని నమ్బిళ్ళై ఉదాహరించారు.

శ్రీశత్రుఘ్నాழ్వాన్ శ్రీరాముని కన్నెత్తి చూడకపోయినా, శ్రీరామునకు మిక్కిలి ఇష్టమైన భరతుని తప్ప ఇంకొకరిని తెలియని రీతిలో అనన్యభక్తిని కల్గినవాడై నందున,

శత్రుఘ్నాళ్వాన్ శ్రీరామునకు ఇష్టుడయ్యాడు – అనేది శ్రీరామానుజులు పల్కిన సరసమైన సమాధానం. అందుచేత **"అనఘః, నిత్యశత్రుఘ్నః"** అనే విశేషణాలు రెండు శత్రుఘ్నునకు చక్కగా పొసగుతాయి. భగవదీయత్వం – అంటే – భగవానునకు చెంది ఉండడమనేది ఉద్దేశ్యమైనపుడు – శత్రుఘ్నునకు చెప్పబడిన అతిశయం అతో పొసగుతుంది.

ఇక్కడ శిక్షింపబడిన, గమనించవలసిన రస్యరహస్యార్థం ఏమంటే – భగవద్విషయంలో ఏ లోటు లేని రుచిని కల్గిన భరతాళ్వాన్‌వంటి వారి అభిమానాన్ని పొంది ఉజ్జీవించి, "వారి శ్రీ చరణాలే ప్రాప్యం, ప్రాపకం" అనే గట్టి నమ్మకాన్ని శత్రుఘ్నునివలె కల్గి ఉంటే, శ్రీరాముని ప్రీతికి శత్రుఘ్నాళ్వాన్ లక్ష్యమైనట్లు, మనం కూడా భగవంతుని అనుగ్రహానికి పాత్రం కాగలము – అని. ఇంతే తప్ప, ఒక సామాన్య మానవుడు ఇంకొకనికి ఉద్దేశ్యభూతుడై (ఆశ్రయించ దగినవాడై) ఉండడం అనేది, తక్కువ చిల్లుపడిన పడవ – ఎక్కువ చిల్లుపడిన ఓడకు సహాయమైనట్లే వ్యర్థమే కాక, అపాయానికికదా హేతువు అవుతుంది. అయితే, నేరుగా భగవంతునే అనువర్తించవచ్చు కదా! అంటే, భగవద్భక్తులను **"అనన్యా శ్చింతయంతః"** అనే విధంగా అనన్యంగా ఉపాసించడం అంటే **"భక్తాస్తే౽తీవ మే ప్రియాః"** అని, **"స చ మమ ప్రియః"** అని, **"స మహాత్మా"** అని **"మమ ప్రాణా హి పాండవాః"** అని భగవానుడు వారు తనకు మిక్కిలి ప్రియమైనవారని, ప్రాణస్థానీయులని అనడంచేత, భగవంతుని ఆరాధించినట్లే కాగలదు.

**(19) (4–3–5) ఈడు**

**(ఏలుమ్ ఆడైయుమ్ అవదే). ఒరునాళ్ ఒరు శ్రీవైష్ణవ వణ్ణాత్తాన్ తిరుప్పరిపట్టజ్గళై అళ్గ కిదాక వాట్టికొణ్ణువన్దు ఎమ్బెరుమానారుక్కు క్కాట్ట, పోర తృప్తరాయ్, అవనై పెరుమాళ్ తిరువడికళిలే ప్పిడిత్తుక్కొణ్డు పుక్కు, "నాయన్దే! ఇవన్ తిరువరైక్కు ఈడామ్బడి వాట్టినపడి తిరుక్కణ్ శాత్తియరుళవేణుమ్" ఎన్ఱు ఇవన్ఱై క్కాట్టి యరుళ, కణ్డు ఉకన్దరుళి, ఉడైయవరై అరుళ్‌పాడిట్టు, "ఇవనుక్కాక రజకన్ నమ్ తిఱత్తిల్ శెయ్‌ద కుఱ్ఱమ్ పొఱుత్తోమ్" ఎన్ఱు తిరువుళ్ళమాయరుళినాన్.**

**("ఏలుమాడైయు మవదే")** (భగవంతునకు తగిన వస్త్రం కూడా నా ప్రేమయే)

అని ఆ<u>ళ్</u>వార్లు పల్కిన సూక్తిని వివరించే నమ్బిళ్ళై ఒక ఐతిహ్యాన్ని ప్రస్తావించారు.

ఒకనాడు ఒక శ్రీవైష్ణవరజకుడొకడు శ్రీరంగంలోని శ్రీరంగనాథుని వస్త్రాలను చక్కగా ఉతికి, తెల్లగా చలువచేసి ఆరబెట్టి తీసికొని వచ్చి శ్రీరామానుజులకు చూపించాడు. శ్రీరామానుజులు చాలా సంతోషించి, అతని చేతితో పట్టుకొని శ్రీరంగనాథుని సన్నిధికి తీసికొని, అతనిని చూపించి, "స్వామీ! ఇతడు దేవరవారి మృదువైన నడుముకు తగినట్లు వస్త్రాలను చక్కగా ఉతికి, తీసికొనిరావడాన్ని కటాక్షించు" – అని విన్నవించి, ఆ వస్త్రాలను శ్రీరంగనాథునకు చూపించాడు. శ్రీరంగనాథుడు ఆనందించి, "ఈ రజకునికోసం గతంలో కంసుని చాకలివాడు నాపట్ల చేసిన అపచారాన్ని క్షమించాను" అని అన్నాడు.

శ్రీకృష్ణుడు, బలరాముడు ధనుర్యాగానికై కంసునిచే పిలువబడినవారై మధురకు వెళ్ళినపుడు అపుడు ఆ ఊరి రాజవీథిలో కంసుని రజకుడు ఉతికిన వస్త్రాల మూటను మోసికొని వస్తున్నాడు. అతనిని తమకు తగిన వస్త్రాలను ఇమ్మని బలరామ కృష్ణులు అడిగినా, అతడు వారి మాటను తిరస్కరించాడు. కంసుని చాకలివాడు చేసిన అపరాధం ఇదే. ఈ వృత్తాంతం శ్రీవిష్ణుపురాణంలో (5–19), శ్రీభాగవతంలో ఉన్నది.

**"ఏలుమ్ ఆడైయుమ్"** అనే ప్రయోగానికి – తగిన వస్త్రం అని అర్థం. దీనికి – నడుము అందానికి తగిన వస్త్రం – అని, పురుషోత్తమత్వానికి తగిన వస్త్రమని – రెండర్థాలు. వీటిలో మొదటి అర్థానికి సంవాదంగా ఈ ఐతిహ్యం ప్రస్తావింపబడింది. శ్రీరామానుజుల సూక్తిలో **"తిరువరైక్కుత్తకుతియాక"** అని ఉన్నది కదా!

ఇరుపత్తునాలాయిరప్పడి వ్యాఖ్యలో **"తిరుప్పరియట్టమ్ వెళుప్పిత్త శ్రీవైష్ణవ వణ్ణాత్తాన్ వార్త్తై"** అని ఏతావన్మాత్రమే కన్పిస్తున్నది. ఇదే ఐతిహ్యం (5–10–6) పాశురానికి ఈడువ్యాఖ్యలో ప్రస్తావింపబడింది.

శ్రీరంగంలోని శ్రీరంగనాథుని ఉత్సవమూర్తిని గుర్తుపట్టవలసి వచ్చినపుడు రజకుడే ఆ విగ్రహాన్ని వాసనచూచి గుర్తించి **"ఇవరే నమ్ పెరుమాళ్"** అని అన్నాడని,

అందువల్ల ఆ పేరే శ్రీరంగంలోని ఉత్సవమూర్తి **"నమ్బెరుమాళ్"**గా వ్యవహరింప బడుతున్నది - అని **"నమ్బెరుమాళ్ నమ్మాఴ్వార్"** ఇత్యాది ఉపదేశరత్తినమాలై పాశుర వ్యాఖ్యలో శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ తెలిపారు.

**???** తిరువాయ్‌మొ*ఴి*-**(4-4-10)** ఈడువ్యాఖ్యానమ్ :

**(వల్‌వినైయేన్)- "ఆళ్వాన్ తిరునయనఙ్గళ్ నోవుపట్ట పిన్బు ఎమ్బెరుమానార్ తిరువుళ్ళమ్ నోవుపట్టాప్పోలే కాణుమ్, తిరుత్తాయార్ తిరువుళ్ళముమ్ పడుకిఱదు.**

**(వల్‌వినైయేన్)** - కూరేశులనేత్రాలకు బాధకల్గినదని తెలిసినతరువాత శ్రీరామానుజుల మనస్సు క్లేశపడినట్లుకదా, పరాంకుశనాయకి తల్లి మనస్సు బాధపడుతున్నది.

సందర్భం : భగవానుని స్వభావాలతో పోలిన స్వభావాలను చూచి, వాటిని భగవానునిగా భ్రమించి మోహాన్ని పొందిన పరాంకుశనాయకిని చూచి, ఆమె తల్లి **"ఎన్ శెయ్‌కేన్? వల్‌వినైయేన్!"** (ఏమి చేయను! పాపిష్ఠిదానను) అని అంటున్నది. దీనికి ఉదాహరణగా, ఈవిధంగానే శ్రీరామానుజులు కూరేశుల విషయంలో బాధపడిన సందర్భాన్ని నమ్పిళ్ళై తమ ఈడు వ్యాఖ్యలో పై ఆ*ఴ్వా*ర్ల సూక్తిని వివరిస్తూ ప్రస్తావించారు.

వివరణం : చోళరాజుసభలో **"శివాత్ పరతరం నాస్తి"** పత్రంలో వ్రాసి సంతకం చేయమని ప్రభువు కూరేశులను నిర్బధించాడు. దానికి కూరేశులు అంగీకరించినందున కోపించిన చోళరాజు వారి నేత్రాలను తీసివేయమని భటులను ఆజ్ఞాపించాడు. "పాపివి అయిన నిన్ను చూచిన కళ్ళు నాకు అక్కరలేదు'' అని కూరేశులు తమ నేత్రాలను తామే స్వయంగా చేసివేసికొన్నారు.

కూరేశులు నేత్రాలను కోల్పోయిన సంగతిని తిరునారాయణ పురంలో ఉండే శ్రీరామానుజులకు తరువాత కొంతకాలానికి తెలిసింది.

తమ పాపం కారణంగానే కూరేశులు నేత్రాలను కోల్పోయారని అంటూ శ్రీరామానుజులు క్లేశపడ్డారు. ఆ విధంగానే ప్రకృతంలో కూడా పరాంకుశనాయకి తల్లి తన పాపం వల్లనే తన కుమార్తె మోహాన్ని పొంది దుఃఖపడుతున్నాడని తలచి తనను **"వల్వినైయేన్"** అని నిర్దేశించు కొన్నది - అని తాత్పర్యం.

లోకంలోనివారిని అందఱిని ప్రేమించే స్వభావం శ్రీవైష్ణవ లక్షణం. తనలో ఏ దోషంలేక పోయినా, ''నేనే దోషాన్ని కలవాడను'' అని భావించడంకూడా శ్రీవైష్ణవ లక్షణమే. దీనిని శ్రీరామాయణంలో సీతాదేవి పల్కిన **"మత్పాపమేవాత్ర నిమిత్తమాసీత్"** అనేసూక్తి, తిరుప్పావై 15వ పాశురంలోని **"నానేదాన్ ఆయిడుక"** (నేనే దోషురాలను, కానివ్వండి) అనే సూక్తి తెల్పుతున్నది. ఉత్తమ శ్రీవైష్ణవ లక్షణాలను కల శ్రీరామానుజులు కూరేశులు నేత్రాలను కోల్పోవడానికి తమ పాపమే హేతువని అనడం యుక్తం కదా! అందువల్ల ఈ సూక్తి కూరేశుల ఉత్తమ శ్రీవైష్ణవత్వాన్ని నిరూపిస్తున్నది.

ఇంకొక విశేషం కూడా ఇక్కడ గమనించదగినది ఉన్నది. కూరేశులను శ్రీరామానుజులు తమ ప్రియపుత్రికగా సంభావించారని, కూరేశులు పరమపదించినపుడు **"ఉలకమ్ నిఱైన్ద పుకళాల్ తిరుమకళ్ పోల్ వళర్త్తేన్... శెఙ్గణ్మాల్తాన్ కొణ్డుపోనాన్"** (లక్ష్మీదేవిని వలె పెంచాను... పుండరీకాక్షుడు తీసికొనిపోయాడు) అని గోదాదేవిని ఉద్దేశించి పెరియాழ్వార్లు బాధపడినట్లుగా, ఆ సూక్తిని ఉదాహరిస్తూ బాధపడ్డారని కూరేశుల, శ్రీరామానుజుల చరిత్రలో ప్రసిద్ధం. పెరుమాళ్ తిరుమొழి ప్రబంధానికి తనియన్ అనుగ్రహించే శ్రీరామానుజులు అందులో **"ఇన్ అముదమ్ ఊట్టుకేన్ ఇఙ్గే వాపైఙ్కిళియే"** (పరమభోగ్యమైన అమృతాన్ని తాగిస్తాను, నా పచ్చని చిలుకా! ఇక్కడకు రా) అని శ్రీరామానుజులు కూరేశులను తమ పెంపుడు చిలుకగా భావించి సంబోధించారని

పూర్వాచార్యుల అభిప్రాయం. ఇటువంటి నేపథ్యాన్ని దృష్టిలోపెట్టుకొని నంబిళ్ళై ఇక్కడ, శ్రీరామానుజులకు, కూరేశులకు తల్లి కూతుళ్ళ సంబంధం స్ఫురించేటట్లు వివరించడం చాలా సరసం, ఉచితం.

**41. తిరువాయ్ మొழி - 4-4-10 - ఈడు వ్యాఖ్య.**

**(వల్‌వినైయేన్) ఆழ்வான్ తిరునయనఙ్గళ్ నోవుపట్ట పిన్బు ఎమ్బెరుమానార్ తిరువుళ్ళమ్ నోవు పట్టాట్పోలే కాణుమ్ తిరుత్తాయార్ తిరువుళ్ళముమ్ పడుకిఅతు.**

**సందర్భం**:- భగవానుని స్వభావాల వంటి స్వభావాలను కల కొన్ని వస్తువులను చూచి, వానిని భగవానునిగానే తలచి మోహించిన పరాంకుశనాయకి వద్దకు వచ్చిన ఆమె తల్లి "ఏం చేయను? పాపిష్ఠిదాన్ని?". ఈమెను ఈ విధంగా చూడడానికి నేను ఏం పాపం చేశానో!" అని వాపోతున్నది. దీనికి అనుగుణంగా వ్యాఖ్యాత ఇదే రీతిలో భగవద్రామానుజులు బాధపడిన వృత్తాంతాన్ని ఉట్టంకిస్తున్నారు.

**వివరణం**:- చోళరాజు సభలో **"శివాత్ పరతరం నాస్తి"** అని వ్రాసిన సంతకం చేయమని బలవంతం చేసినపుడు, కూరేశులు అందులకు అంగీకరించకుండా తిరస్కరించారు. అందు కోపించిన ప్రభువు కూరేశుల నేత్రాలను పెకిలించి వేయవలసినదిగా ఆజ్ఞాపించాడు. "పాపి అయిన నిన్ను చూచిన ఈ కళ్ళతో ఇక నాకు పని లేదు" అని కూరేశులు తామే స్వయంగా తమ నేత్రాలను తీసివేసికొన్నారు. ఈ విధంగా కూరేశుల నేత్రాలకు కల్గిన హానిని విని శ్రీరామానుజులు చాలా బాధపడి దీనికి అంతటికీ కారణం తమ పాపమే అని దుఃఖించినట్లే, ఇక్కడకూడా పరాంకుశ నాయకి తల్లి తన పాప ఫలంగానే తన కూమార్తె మోహాన్ని పొంది, బాధపడుతున్నదని తలచి, తనకు **"వల్ వినైయేన్"** అని నిర్దేశించుకొన్నది. (తన వద్ద తప్పు లేకపోయినా **"నానే దాన్ ఆయిడుక"** (నేనే దోషిని కానివ్వండి) అని అనడం ఉత్తమ శ్రీవైష్ణవలక్షణం - అని ఇక్కడ సూచింపబడింది. ఆ రీతిలోనే ఇక్కడ భగవద్రామానుజులు, పరాంకుశనాయకి తల్లి తమ పాపంవల్లనే బాధకల్గిందని పల్కి శ్రీవైష్ణవలక్షణాన్ని అనుష్ఠించి చూపించారని గమనించాలి)

**"మత్పాప వేంవాత్ర నిమిత్తమాసీత్"** అని సీతాదేవి తన పాపం వల్లనే ఇన్ని కష్టాలు కలిగాయని బాధపడుతూ పల్కిన సూక్తి ప్రకృతంలో స్మరణీయం.

భగవద్రామానుజుల కూరేశులను తమ పుత్రికగా భావించి ఆదరించారనే విషయాన్ని ఈ ఐతిహ్యం నిరూపిస్తున్నది. పెరియాఌ్వార్ తిరుమొఌిలోని **"ఒరు మకళ్తన్నై యుడైయేన్"** అనే సూక్తి వ్యాఖ్య కూడా దీనికి అనుగుణంగా స్మరణార్హం. **"ఇన్నముద మూట్టుకేన్ ఇఙ్గేవాపై ఌ్కియే!"** అని శ్రీరామానుజులు పల్కిన పెరుమాళ్ తిరుమొఌి తనియన్ పాశురంలోని **"కిళి"** (చిలుక). కూరేశులే అని అభిజ్ఞుల సూక్తి, కూరేశులను తమ ప్రియ పుత్రికగా శ్రీరామానుజులు సంభావించారు – అనేదానికి ఇది ఇంకొక దృష్టాంతం. అరుంబదాలలో ఈ ఐతిహ్యం పాశురంలోని "ఎన్శెయ్కేన్" అనే పదానికి సంవాదమని తెలుపబడింది. కూరేశులు నేత్రాలు కోల్పోయిన సంగతిని విని శ్రీరామానుజులు "ఏమి ప్రతి క్రియ చేయను?" అని తల్లడిల్లినట్లుగా పరాంకుశనాయకి తల్లి కూడా తల్లడిల్లుతున్నదని తాత్పర్యం.

**43. తిరువాయ్ మొఌి -4-7-5- ఈడు వ్యాఖ్య.**

**("ఏఌైయేన్") ఎన్ చాపలమేయిఱే యుళ్ళతు. ఆఌ్వాన్ పణిత్త వరదరాజస్తవత్తిలే ఒరు శ్లోకత్తై క్కేట్టు ఎమ్బెరుమానార్ ఇప్పాశురమ్ కేట్టాల్ పెరుమాళ ఇరఙ్గామై ఇల్లై. ఆఌ్వాన్! ఉన్ ముకత్తై క్కాట్టికాణాయ్ – ఎన్రు పార్త్తరుళినార్.**

**సందర్భం :– "ఇప్పొఌుదే వన్దిడాయ్ ఎన్రు ఏఌైయేన్ నోక్కువనే"** (ఇపుడే నీవు రావాలి– అని ఆశను కలవాడనై నిరీక్షిస్తున్నాను) అని ఆఌ్వార్లు కోసం భగవానుని కోసం ఎదురు చూస్తున్నారు. భగవానుడు వచ్చే అవకాశం లేదని తెలసినా అతిశయించిన చాపల్యం వల్ల అతడు రావడానికి అవకాశం ఉండే దిక్కులలో అంతటా ఆశగా ఎదురుచూస్తున్నారు – అనే ఆ( )ర్ల సూక్తిని వివరిస్తూ, అలభ్య విషయంలో కూడా అధికమైన ఆశ కల్గుతుంది – అనేదానికి శ్రీరామానుజులకు చెందిన ఒక ఐతిహ్యాన్ని నమ్పిళ్ళై ప్రస్తావించారు.

**వివరణం:–** చోళరాజువల్ల నేత్రాలను కోల్పోయిన కూరేశులను చూసి బాధపడిన భగవద్రామానుజులు "కూరేశా! నేత్రాలు లేనివారుగా మిమ్ములను

చూడడం నా వల్ల కావడం లేదు. స్వరూపవిరుద్ధమైనా కానివ్వండి. కంచి వరదరాజస్వామిని ఉద్దేశించి మీకు కన్నులను ప్రసాదించమని ప్రార్థించండి. వరదరాజస్వామి **"వరన్తరుమ్ పెరుమాళ్"** కనుక మీకు తప్పకుండా నేత్రాలను ప్రసాదిస్తాడు" అని అన్నారు. కూరేశులుకూడా అదే విధంగా వరదరాజస్తవం అనే ఒక గొప్ప స్తుతిని రచించారు. ఆ స్తుతిలోని **"నీలమేఘనిభ మంజనపుంజ శ్యామకుంతల మనంతశయం త్వామ్, అబ్జపాణిపద మంబుజనేత్రం నేత్రసాత్కురు కరీశ! సదా మే"** (హస్తిగిరినాథా! కారుమబ్బువంటివాడవై, కాటుకరంగులో ఉండే నల్లని అందమైన కేశపాశాన్ని కలవాడవై, అనంతునిపైన పరుండి ఉన్నవాడవై, తామరలవంటి శ్రీహస్తాలను, శ్రీపాదాలను కలవాడవై, తామరలవంటి నేత్రాలను కలవాడవైన నిన్ను ఎల్లప్పుడు నేను నా కళ్ళతో సేవించేటట్లు అనుగ్రహించు) అనే శ్లోకాన్ని (23) వినిన శ్రీరామానుజులు "కూరేశా! ఈ శ్లోకాన్ని వింటే నిశ్చయంగా వరదరాజస్వామి మీకు నేత్రదానాన్ని చేయకుండా ఉండలేదు. మీ ముఖాన్ని స్వామి చూపించండి. మీకు దృష్టిని తప్పక కల్గిస్తాడు, చూస్తాను" – అని అన్నారు. ఈ ఐతిహ్యాన్ని అడైయువళైన్దాన్ అరుంబదం ఈ క్రిందివిధంగా వివరించింది.

శ్రీరామానుజులు కూరేశులు కల్గిన ఆపదను చూచి, మనస్సులో చాలాబాధ పడి, కూరేశులను చూచి – "కూరేశా! నేను మిమ్ములను ఈ విధంగా చూడలేను ఫలాన్ని కోరడం స్వరూప విరుద్ధమైన కానీ. మీరు వరదరాజ స్వామి సన్నిధిలోకి వెళ్ళి, స్తోత్రం చేసి, నా అభీష్టాన్ని పొంది రండి – అన్నారు. కూరేశులు కూడా వరదరాజస్వామిని స్తుతించి, తిరిగి వచ్చాయి. "స్వామి నేత్ర దృష్టిని అనుగ్ర హించాడా?" అని అడుగగా, "అనుగ్రహించలేదు" అని కూరేశులన్నారు. "మీ కోరిక స్పష్టమయేటట్లు విన్నవించారా?" అని శ్రీరామానుజులనగా, "ఆవిధంగానే విన్నపించాను" అని కూరేశులు పలికారు. "అయితే, అందులో ఒక శ్లోకాన్ని చెప్పండి" అనగా, కూరేశులు పల్కిన శ్లోకాన్ని విని, "ఈ శ్లోకాన్ని వింటే వరద రాజస్వామి అనుగ్రహించకుండా ఉండడు. కూరేశా! మీముఖాన్ని చూపించండి" అని కూరేశులముఖాన్ని చూచారట ఇది చాపలాతిశయమే కదా. కూరేశులు విన్నపించిన శ్లోకం "త్వాముదార భుజమ్" ఇత్యాది శ్లోకం –

**(4-8-2) ఈడు.**

**"ఇజ్గే అరుళిచ్చెయ్యుమ్ వార్త్తై - ఎమ్బెరుళి యిరుక్కిఱ మడత్తిలే శ్రీవైష్ణవర్కళ్ అముదు శెయ్యానిఱ్క, ఆచ్చాన్ తణ్ణీరముతు పరిమాఱుకిఱవర్ ఓరరుకు శాయనిన్ఱు పరిమాఱినార్. అత్తై ఉడైయవర్ కణ్డు ఓరడి వన్దు ముదుకిలే మోది - "నేరే నిన్ఱన్ఱోపుడో పరిమాఱువతు" ఎన్న, "ఆచ్చాన్" పణిమానమ్ పిழైయామే అడియేనై ప్పణికొణ్డ" ఎన్ఱు పణిత్తాన్.**

**"పణిమానమ్ పిழైయామే అడియేనై ప్పణికొణ్డ మణిమాయన్"** (కైంకర్యాన్ని చేయడంలో ఏవిధమైన కొఱత లేకుండా దాసుడనైన నన్ను సంస్కరించి, నానుండి కైంకర్యాన్ని పరిగ్రహించిన మణివలె నీలవర్ణుడు- అని అంటూ భగవానుని పట్ల తమ కృతజ్ఞతను ఆழ్వార్లు వ్యక్తం చేశారు. ఈసూక్తిని వివరించే సందర్భంలో నమ్పిళ్ళై ఈడువ్యాఖ్యలో కిడాంబి యాచ్చాన్‌కు సంబంధించిన ఈక్రింది ఐతిహ్యాన్ని ఉట్టంకించారు.

భగవద్రామానుజులు వేంచేసి ఉండే మఠంలో శ్రీవైష్ణవులకు కొందఱికి తదీయారాధన జరిగే సమయంలో కిడాంబి ఆచ్చాన్ తీర్థాన్ని (తాగే నీటిని) అందిస్తున్నారు. తదీయారాధనలో తీర్థాన్ని కావలసినవారికి ఒకరు నీటిని ఒక పాత్రలో తీసికొని వారివారి నోటిలో కొంచెం కొంచెంగా పోయడం అలవాటు) ఈ రీతిలోనే, కిడాంబి ఆచ్చాన్ తీర్థాన్ని అడిగినవారికి నేరుగా నిలచి నీటిని వారికి పోయకుండా, ఒక పక్కగా ఉండి తీర్థాన్ని అందిస్తున్నారు. తీర్థాన్ని అడిగినవారు తాము కొంచెం వంగి ఆచ్చాన్ పోసే నీటిని గ్రహిస్తున్నారు. దీనిని చూచిన శ్రీరామానుజులు వేగంగా అక్కడకు వచ్చి, కిడాంబి ఆచ్చాన్ వీపుపై తట్టి, "నేరుగా నిలచికదా తీర్థాన్ని అడిగినవారి నోటిలో పోయాలి. లేకపోతే తీర్థాన్ని తాగేవారికి పొఱమాఱుతుంది" అని మందలించారు. దీనిని విన్న కిడాంబి ఆచ్చాన్ **"పణి మానమ్ పిழైయామే అడియేనై ప్పణికొణ్డ"** (కైంకర్యంలోని అవధిత తగ్గని రీతిలో దాసుడనైన నన్ను సంస్కరించి కైంకర్యాన్ని గ్రహించిన) అనే ఆళ్వార్ల పాశురాన్ని అనుసంధించారట. "ఇంతటి చిన్న విషయాన్నికూడా గమనించి శ్రీరామానుజులు తమరు నన్ను తీర్చిదిద్ది సేవకునిగా గ్రహిస్తున్నారుకదా!" అని

ఆచ్చాన్ తాత్పర్యం.

"పణి" – అంటే – పని, అంటే – కైంకర్యం. ఇది ద్రావిడ పదం. "మానమ్" – పరిమితి. ఇది సంస్కృత పదం. ఇటువంటి ప్రయోగాలు సంస్కృత ద్రావిడ పదాల మేలు కలయిక వల్ల ఏర్పడే మణిప్రవాళ శైలీ సౌందర్యానికొక ఉదాహరణం.

దీనివల్ల ఆచ్చాన్ ఆచార్యవిధేయత, వారి విషయంలో శ్రీరామానుజులకు గల ప్రీతి, శ్రద్ధ శ్రీరామానుజులకు గల **"స్థాలిత్యే శాసితారమ్"** అనే ఆచార్య లక్షణ పూర్తి వ్యక్తం అవుతున్నాయి.

**(20) (5-1-9) – ఈడు**

**"ఆళవందార్ అరుళిచ్చెయ్‌దారాక త్తిరుమాలైయాణ్డాన్ పణిక్కుమ్బడి" – తిరుచ్చక్కరమ్ శఙ్గినొడుమ్ అడియేనొడుమ్ ఆనాన్" ఎన్ఱు. కైయిల్ ఆழ్వార్‌కళోడు పొరున్దినాప్పోలే ఎన్నోడే వన్దు కలన్దాన్ ఎన్గిఱార్ – ఎన్ఱు. అత్తై ఎమ్బెరుమానార్ కేట్టరుళి, "ఇఙ్గనేయాక అడుక్కుమ్. కూరారాழிవెణ్ శఙ్గేన్ది వారాయ్" – ఎన్ఱాయ్‌త్తు ఇవర్ ఆశైప్పట్టిరుప్పదు. ఆశైప్పట్టపడియే దివ్యాయుధఙ్గళోడే వన్దు కలన్దాన్ – ఎన్గిఱార్ ఎన్ఱు అరుళిచ్చెయ్‌దరుళుమ్బడి.**

(ఆళవందార్ ఈ విధంగా అనుగ్రహించారని తిరుమాలైయాణ్డాన్ పలికే వారు – శ్రీసుదర్శనంతో, శ్రీపాంచజన్యంతో సంశ్లేషించినట్లు నాతోకూడా సంశ్లేషించాడు – అని. తన శ్రీహస్తంలోని ఆழ్వార్లతో (ఆయుధాలతో) పొసగి ఉండేటట్లు, నాతో కూడా సంశ్లేషించాడు – అని (ఆళవందార్ పలికారు). దానిని శ్రీరామానుజులు విని, "అర్థం ఈ విధంగా చెప్పవచ్చు. **"కూరారాழி వెణ్‌శఙ్గేన్ది వారాయ్"** – పదునైన అంచును కల శ్రీసుదర్శనాన్ని, పాంచజన్యాన్ని ధరించి రావాలి – అని వీరు ఆశపడ్డారు. ఆశపడిన రీతిలో దివ్యాయుధాలతో వచ్చి స్వామి కలిశాడు – అని పల్కుతున్నారు – అనే మఱొక సరసమైన అర్థాన్ని చెప్పారు.

**"దేవార్ కోలత్తొడుమ్ తిరుచ్చక్కరమ్ శఙ్గినొడుమ్ ఆవావెన్ఱు అరుళ్ శెయ్‌దు అడియేనొడుమ్ ఆనాన్"** (దివ్యాలంకారంతో, శ్రీసుదర్శన, పాంచజన్యాలతో, ఆహా!

ఆహా! అని అనుగ్రహించి, నాతో సంశ్లేషించాడు) అని ఆళ్వార్లు పల్కిన సూక్తిని వివరిస్తూ నమ్పిళ్ళై ఈడు వ్యాఖ్యలో ఆళవందార్, శ్రీరామానుజులు పల్కిన అర్థ నిర్వాహాలను ప్రస్తావించారు.

శ్రీసుదర్శనంతో, శ్రీపాంచజన్యంతో భగవానుడు పొందికగా వేంచేసి ఉండేటట్లే, తమతోకూడా పొందికగా అప్రాకృత రూపంతో వచ్చి సంశ్లేషించాడని ఆళ్వార్లు పల్కుతున్నారు – అని ఆళవందార్ అర్థనిర్వాహాన్ని చేసినట్లు తిరుమాలై యాణ్డాన్ పలికారు. "తేవార్‌కోలత్తొడుమ్" – అప్రాకృతమైన, అందమైన తిరుమేనితో అని, "తిరుచ్చక్కరమ్ శఙ్గినొడుమ్" చక్రంతో, శంఖంతో పొందికగా ఉండేటట్లే "అడియే కొడుమ్ ఆనన్" అప్రాకృత విగ్రహంతో నాతో సంశ్లేషించాడు" – అని యామునుల నిర్వాహంలో అర్థం. **"అడియేనొడుమ్"** అనేచోట్ల గల **"ఉమ్"**ను (చకారాన్ని) బట్టి తనచేతిలోని ఆయుధాలతో పొసగి సంశ్లేషించినట్లే, తమతో కూడా సంశ్లేషించాడని అంటున్నారని ఆళవందార్ నిర్వాహం. ఈ అర్థంలో **"తిరుచ్చక్కరమ్ శఙ్గినొడుమ్"** అనేది దృష్టాంతం.

దీనిని శ్రీరామానుజులు విని – "ఇక్కడ ఈ క్రింది విధంగా అర్థాన్ని గ్రహించడం సరసం. **"కూరారాళివెణ్ శఙ్గేన్ది కొ్డియేన్‌పాల్ వారాయ్"** అని (6–9–1) ఆళ్వార్లు ప్రార్థించె రీతిలోనే స్వామి శంఖచక్రాలు మొదలైన దివ్యాయుధాలను ధరించినవాడై వచ్చి, ఆళ్వార్లతో సంశ్లేషించాడు – అని వేఱొక అర్థాన్ని పలికారు.

ఈ ఐతిహ్యప్రస్తావన ఇరుపత్తునాలాయి రప్పడి వ్యాఖ్యలో కూడా కన్పిస్తున్నది.

శ్రీరామానుజుల నిర్వాహంలో **"అడియేనొడుమ్"** అనే చోట గల చకారానికి (**"ఉమ్"** కు) – అతినీచుడనైన నాతో సైతం – అని అర్థం. "ఆర్‌తిరుచ్చక్కరమ్" అంటే తిరుమేనికి తగిన సుదర్శనమని అర్థం. "తేవు" – దివ్యాలంకారంతో అని అర్థం. దివ్యమైన అలంకారంతో, తిరుమేనికి సుదర్శన పాంచ జన్యంతో వచ్చి అతి నీచుడనైన నాతో కలిశాడు" అని శ్రీరామానుజ నిర్వాహ తాత్పర్యం "తేవుకోలత్తొడుమ్, ఆర్ తిరుచ్చక్కరమ్ శఙ్గొ నొడుమ్ ఆడియే నొడుమ్ ఆనాన్" అని అన్వయం. ఆఱాయిరప్పడి వ్యాఖ్యలో "తన్నుడైయ సర్వలోకేశ్వరత్వ సూచక మాన నిరవధిక

సౌందర్యంత్తోడుమ్, తిరువాళి తిరుచ్చఙ్గుతుడక్కమాన దివ్యాయుధ ఙ్గళోడుమ్ కూడవన్దు, అవర్కళోడు కలన్దరుళు మాప్పోలే అడియేనెడుమ్ కలన్ద రుళినాన్ – ఎన్గిఱార్" (తన సర్వలోకేశ్వరత్వాన్ని సూచించే అంతులేని సౌందర్యంతో, సుదర్శనం, పాంచ జన్యం మొదలైన దివ్యాయుధాలతో కూడ వచ్చి, వారితో సంశ్లేషించే టట్లే నాతో కూడా సంశ్లేషించాడు – అని అంటున్నారు) అని ఆళవందార్ నిర్వాహ పరంగా పలికారు. పన్నిరాయిరప్పడి వ్యాఖ్యలో ఒన్బదినా యిరప్పడి వ్యాఖ్యలో కూడా ఈవిధంగా వివరింపబడింది. ఇరుపత్తు నాలాయిరప్పడిలో శ్రీయామునుల, శ్రీరామానుజుల నిర్వాహాలు రెండు ప్రస్తావించబడ్డాయి. **"కోలత్తొడుమ్"** అనేచోట ఉండే **"ఉమ్"** చకారానికి ఆళవందార్ నిర్వాహంలో **"కోలంతో – దివ్యాలంకారంతో"** అని అర్థం. శ్రీరామానుజుల నిర్వాహంలో ఇది హేత్వంతరం.

**(21) (5–2)** ఈడు ప్రవేశమ్

**"ఇత్తిరువాయ్మొ*ழ*ియై ఆళవందార్ అరుళిచ్చెయ్దారాక త్తిరుమాలై యాణ్డాన్ పణిక్కుమ్బడి – ఆ*ழ*్వారుడైయ శ్రీవైష్ణవశ్రీయై క్కాణ్గైక్కాక నిత్యసూరికళ్ ఇఙ్గే వర, అవర్కళై క్కణ్డు మఙ్గళాశాసనమ్ పణ్ణుకిఱార్" – ఎన్ఱు.**

**"నణ్ణాదార్ ముఱువలిప్ప" లిలే సంసారికళ్ పడుకిఱ క్లేశత్తై అనుసంధిత్తు, అదుక్కు ప్పరిహార మాక "ఒన్ఱుమ్ తేవి"లే భగవత్పరత్వత్తై ఉపపాదిత్తు త్తిరుత్త, అత్తాలే తిరున్ది, సంసార పరమపద విభాగమ్ అఱ, అఙ్గుళ్ళారుమ్ ఇఙ్గే వరలామ్బడి యిరుక్కిఱ ఇరుప్పై క్కణ్డు, మఙ్గళాశాసనమ్ పణ్ణకిఱార్ – ఎన్ఱు. ఇఙ్గుళ్ళార్ పక్కలిలే ప్రాధాన్యమ్ తో*న్ఱ* ఎమ్బెరుమానార్ అరుళిచ్చెయ్యుమ్బడి".**

(ఈ దశకానికి అర్థాన్ని ఆళవందార్ ఈ విధంగా తెలియజేశారని తిరుమాలై యాణ్డాన్ అనేవారు. (ఏ విధంగా? అంటే – "ఆ*ழ*్వార్ల శ్రీవైష్ణవ సంపదను దర్శించాలని నిత్యసూరులు ఈ లీలావిభూతికి రాగా, వారిని చూచి ఆ*ழ*్వార్లు మంగళాశాసనం చేస్తున్నారు – అని

**"నణ్ణాదార్ ముఱువలిప్ప"** అనే దశకంలో ఆ*ழ*్వార్లు, సంసారులు పడే బాధలను చూచి, తలచి, దానికి పరిహారంగా **"ఒన్ఱుమ్ తేవుమ్"** అనే దశకంలో

భగవానుని పరత్వాన్ని ప్రతిపాదించి వారిని సంస్కరించారు. అందువల్ల సంసారులు సంస్కరింపబడి, సంసార – పరమపదభేదం తీరిపోగా, అక్కడివారు కూడా ఇక్కడకు వచ్చేటట్లుండే సన్నివేశాన్ని చూచి ఆళ్వార్లు మంగళాశాసనం చేస్తున్నారు" – అని లీలావిభూతిప్రాధాన్యం స్ఫురించేటట్లు శ్రీరామానుజులు పలికారు) (నిత్యవిభూతి ప్రాధాన్యం తోచేటట్లు ఆళవందార్ పలికారు – నిత్య సూరులకు మంగళాశాసనం చేయడమంటే వారి ప్రాధాన్యమే కదా)

**"పొలిక పొలిక"** – అనే దశకంలో నమ్మాళ్వార్లు శ్రీవైష్ణవులకు మంగళా శాసనం చేశారు. ఈ దశకానికి ఆళవందార్, శ్రీరామానుజులు పల్కిన రెండు విధాలైన అర్థసంగతులను ఈ వ్యాఖ్యాత నమ్బిళ్ళై ప్రస్తుతించారు. ఆళవందార్, శ్రీరామానుజులు చేసిన అర్థనిర్వాహాలలో – **"ఒన్ఱుమ్ తేవుమ్"** (4–10) అనే దశకంతో ప్రస్తుత దశకానికి నేరుగా సంగతి. మధ్యలోని **"కైయార్ శక్కరమ్"** (5–1) దశకం ప్రాసంగికం. నిత్యసూరులు ఇక్కడకు వచ్చారనే విషయానికి **"తేవర్కళ్ తాముమ్ పుకున్దు"** (5–2–3), **"నేమిప్పిరాన్ తమర్పోన్దార్"** (5–2–6) ఇత్యాదులు సూచకాలు. "తేవ, ఆర్" అనే రెండు విశేషణలు ఆలవందార్ నిర్వాహంలో "కోలమ్" అనే దానితో అన్వయిస్తాయి. శ్రీరామానుజ నిర్వాహంలో "తేవ" అనే విశేషణం "కోలమ్" అనేపదంతో, "ఆర్" అనే విశేషణం "తిరుచ్చక్కరమ్ శజ్గినొడుమ్" అనే పదంతో అన్వయిస్తుంది.

**"పొలిక పొలిక పొలిక పొయి వల్లుయిర్ శావమ్ నలియుమ్ నరకముమ్ నైన్ద నమనుక్కు ఇఙ్గు యా దొన్దుమిల్లై"** అనే ప్రస్తుత దశకంలోని ఆళ్వార్ల సూక్తి లీలావిభూతి విషయమైనందున, తదనుగుణంగా లీలావిభూతి ప్రాధాన్యం తోచేటట్లు శ్రీరామానుజులు అర్థనిర్వాహం చేయడం ప్రకరణానుగుణం. ఆఱాయిరప్పడి, వ్యాఖ్యలో శ్రీరామానుజ నిర్వాహపరంగా వివరింపబడింది. ఒన్బది నాయిరప్పడిలో రెండు నిర్వాహాలు ప్రస్తుతాలైన, పేర్లు ఉట్టకింపబడలేదు. ఇరుపత్తు నాలాయిరప్పడిలో నామనిర్దేశపూర్వకంగా రెండు నిర్వాహాలు తెలుపబడ్డాయి.

**??? తిరువాయ్మొళి (5-2-4) ~~ఈ~~డువ్యాఖ్యానమ్) :**

**(నాడకమ్ శెయ్‌కిన్టనవే) - ఎమ్బెరుమానారుడైయ స్థితి గమనశయనాదికళై నామ్ కొణ్డాడుమాపోలేయుమ్, ఆళవందార్ నడైయై రాజాకొణ్డానాప్పోలేయుమ్, ఇవర్‌కొణ్డాడుకిఱదు" ఎన్ఱు అరుళిచ్చెయ్‌వర్.**

**(నాడకమ్ శెయ్‌కిన్టనమే)** - శ్రీరామానుజుల స్థితి, గమన, శయనాదులను మనం కీర్తించేటట్లు, ఆళవందార్ నడకను రాజు ప్రశంసించినట్లు, ఆళ్వార్లు భాగవతుల వ్యాపారాలను ప్రశంసిస్తున్నారు)

సందర్భం : తిరువాయ్‌మొళి ప్రబంధంలో **"కిడన్దుమ్ ఇరున్దుమ్ ఎళున్దుమ్ నాడకమ్ శెయ్‌కిన్టనవే"** (భగవానుని భక్తులు పరుండి, కూర్చుండి, నిలచి, పలు పాశురాలను పాడి, నడిచి నేలపై కాలు నిలువని రీతిలో నాట్యం చేసి, ఆనందిస్తూ సంచరిస్తున్నారు) అనే ఆళ్వార్ల సూక్తిలోని **"నాడకమ్ శెయ్‌కిన్టనవే"** అనే ప్రయోగాన్ని నమ్బిళ్ళై శ్రీవైష్ణవుల ఒక్కొక్క వ్యాపారం ఆళ్వార్ల మనస్సును ఆకర్షించి ద్రవింపజేస్తున్నది - అని పల్కి, దానికి ఉదాహరణగా నంజీయర్ పల్కిన వార్తను ప్రస్తావించారు.

**వివరణం :** భగవద్రామానుజుల స్థితి, గమనం, శయనం మొదలైన వానిని మనం కీర్తించేటట్లు, సభలో వాదించడానికి వచ్చిన ఆళవందార్ నడకను ప్రభువు ప్రశంసించినట్లు ఆళ్వార్లు ఇక్కడ శ్రీవైష్ణవుల వ్యాపారాలను కీర్తిస్తున్నారు- అని నంజీయర్ అనేవారు.

ఈ వార్త ఇరుపత్తు నాలాయిరప్పడివ్యాఖ్యలో కూడా ప్రస్తావింప బడింది. శ్రీరామానుజుల స్థితిగమనాదులు వారి భక్తులకు చాలా ఆకర్షకంగా ఉంటాయనే విషయాన్ని **"మడిత్తేన్ మనైవాళ్‌క్కైయై" (10-8-3)** అనే తిరువాయ్‌మొళి సూక్తిని వ్యాఖ్యానిస్తూ నంబిళ్ళై ప్రస్తావించడం ఇక్కడ స్మరణీయం. **"ఎమ్బెరుమానార్ ఉలావి అరుళుకిఱవర్ ముడియప్పోకాదే నడువే మీణ్డరుళ, ఎమ్బార్ కదవై ఒరుచ్చరిత్తు, "తిరుమాలిరుమ్ శోలైయాకాదే తిరువుళ్ళత్తిల్ ఓడుకిఱదు" ఎన్న, "ఆమ్, అప్పడియే" ఎన్ఱు అరుళిచ్చెయ్‌దార్"** (శ్రీరామానుజులు అటు ఇటు

తిరిగేటపుడు ఒకసారి తాము వెళ్ళదలచిన గమ్యం వరకు పూర్తిగా వెళ్ళకుండా మధ్యలో వెనుకకు తిరిగారు. దానినిచూచి ఎమ్బార్, తలుపును కొంచెం తెరచి, "మీ మనస్సులో తిరుమాలిరుమ్‌శోలై పాశురార్థం కదా, మెదులుతున్నది– అని అనగా, శ్రీరామానుజులు "అవును, ఆ విధంగానే" అని సమాధానం పలికారు) అని అక్కడ తెలుపబడింది.

ఈ వార్తవల్ల శ్రీరామానుజులు గమనాదులు చాలా అందమైనవి– అని తెలుస్తున్నది.

**(22) (5–2–4) – ఈడు**

**(నాడకమ్ శెయ్‌కిన్టనవే) – "ఎమ్బెరుమానారుడైయ స్థితిగమనశయనాది కళై నామ్ కొణ్డాడుమాపోలేయుమ్, ఆళవందార్‌నడైయై రాజా కొణ్డాడి నాళ్పోలేయుమ్, ఇవర్ కొణ్డాడుకిఅపడి" – ఎన్టు అరుళిచ్చెయ్‌వర్.**

( **"కిడన్దుమ్ ఇరున్దుమ్ ఎழுన్దుమ్ కీతమ్ పల పల పాడి, నడన్దుమ్ పఱన్దుమ్ కునిత్తుమ్ నాడకమ్ శెయ్‌కిన్టనవే)** – భగవద్భక్తులు పరుండి, వేంచేసి ఉండి, నిలచి పలు పాశురాలను గానం చేస్తూ, నడచి, భూమిపై కాలు మోపని రీతిలో నాట్యం చేసి, ఆనందిస్తూ తిరుగుతున్నారు) అని పల్కిన సూక్తిలో **"నాడకమ్ శెయ్ కిన్టనవే"** అనే ప్రయోగంలోని స్వారస్యాన్ని వివరిస్తూ వ్యాఖ్యాత నంబిళ్ళై, శ్రీవైష్ణవ భక్తులు చేసే ఒక్కొక్క కృత్యం ఆழ்వార్లను పరవశులను చేస్తున్నది – అని పల్కి, దానిని వివరిస్తూ ఈ క్రింది వార్తను ప్రస్తావించారు.

శ్రీరామానుజుల స్థితి, గమన, శయనాదులను మనం కీర్తించేటట్లే, వాదించ డానికి రాజసభకులు ఆళవందార్ వెళ్ళగా, అపుడు వారి గమనాన్ని ప్రభువు కీర్తించి నట్లే, ఆழ்వార్లు ఇక్కడ శ్రీవైష్ణవుల చేష్టలను కీర్తిస్తున్నారు – అని నంజీయర్ పలికారు.

శ్రీరామానుజుల గమన సౌందర్యాన్ని ఎమ్బార్ మొదలైనవారి శిష్యులు దర్శించగోరిన విషయాన్నిగూర్చి ఈడు వ్యాఖ్యలోనే వేఱొక చోట **"మడిత్తేన్"** (10–8–3) అనే సూక్తిని వ్యాఖ్యానిస్తూ నమ్బిళ్ళై ఈ విధంగా ప్రస్తావించడం

గమనించవచ్చు. **"ఎమ్బెరుమానార్ ఉలావి అరుళుకిఅవర్ ముడియపోకాదే నడువే మీణ్డరుళ, ఎమ్బార్ కదవై ఒరుచ్చరిత్తు", "తిరుమాలిరుమ్‌శోలై యాకాతే తిరువుళ్ళత్తిలే ఓడుకిఅదు" ఎన్న, "ఆమ్, అప్పడియే" "ఎన్ఱు అరుళిచ్చెయ్‌దార్"** (ఒకనాడు శ్రీరామానుజులు అటు ఇటు సంచరిస్తూ ఒకసారి చివరి వరకు వెళ్ళకుండా మధ్యలో నిలచిపోయారు. ఎమ్బార్, తలుపులు కొంచెం మూసి చూచి, దేవర వారి మనస్సులో **"తిరుమాలిరుమ్ శోలై మలై ఎన్ఱేన్ ఎన్న"** అనే దశకం మెదులు తున్నదా! ఏమి అని అన్నారు. "అవును, నిజమే, ఆ విధంగానే" అని శ్రీరామానుజులు బదులు పలికారు )

ఆళవందార్ రాజసభలో వాదంకోసం ప్రవేశించినపుడు గంభీరమైన వారి నడకను చూచి ప్రభువు సంతోషించిన వృత్తాంతం వారి చరిత్రలో సుప్రసిద్ధం. పాశురంలోని **"నాడకమ్ శెయ్‌కిన్ఱనవే"** అనే ప్రయోగానికి – సమర్థులైనవారు నాట్యమాడినట్లున్నదనే అర్థాన్ని గ్రహించి, నమ్పిళ్ళై ఈ దృష్టాంతాలను ఉదాహరించారు. ఈ వార్త ఇరుపత్తు నాలాయిరప్పడిలో కూడా ఉన్నది.

**తిరువాయ్‌మొழி - (5-2-6) ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యానమ్:**

**(శెన్ఱు ఇత్యాది) "శెన్ఱు అవర్కళై త్తొழుదు ఉజ్జీవియుజ్గోళ్" ఎన్ఱు** తిరుమాలైయాణ్డాన్ పణిక్కుమ్. "అవర్‌కళోడే శెన్ఱు సర్వేశ్వరనై త్తొழుదు ఉజ్జీవియుజ్గోళ్" ఎన్ఱు అరుళిచ్చెయ్‌వర్, ఎమ్బెరుమానార్. **(శెన్ఱు-ఇత్యాది)**- ''వెళ్ళి భగవద్భక్తులను కొలిచి, ఉజ్జీవించండి'' -అని తిరుమాలైయాణ్డాన్ అని వివరించేవారు. "వారితో కలసి వెళ్ళి, సర్వేశ్వరుని సేవించి, ఉజ్జీవించండి'' అని శ్రీరామానుజులు అనేవారు)

సందర్భం : ఈ లోకంలోని అన్ని క్లేశాలు తీరేటట్లు భగవానుని భక్తులు లోకంలో అంతటా వ్యాపించారు. వెళ్ళికొలిచి ఉజ్జీవించండి. అని పల్కిన ఆழ్వార్ల సూక్తిని వివరిస్తూ పెరియవాచ్చాన్‌పిళ్ళై తిరుమాలై

యాణ్డాన్, (ఆళవందార్) ఎమ్బెరుమానార్ తెలిపిన నిర్వాహాలను ప్రస్తావించారు.

వివరణం : వెళ్ళి, భగవద్భక్తులను కొలిచి, ఉజ్జీవించండి- అని ఆళ్వార్లు పల్కుతున్నారు. (అని ఆళవందార్ వివరించారు) అని తిరుమాలై యాణ్డాన్ తెలిపారు. శ్రీరామానుజులు అయితే- "ఈ భగవద్భక్తులతో కలసి వెళ్ళి, భగవానుని సేవించి తరించండి" అని వివరించారు.

శ్రీరామానుజుల నిర్వాహం - "వేదమ్ వల్లార్కళై క్కొణ్డు విణ్ణోర్పెరుమాన్ తిరుప్పాదమ్ పణిన్దు" (వేదార్థనిపుణులైన వారిని పురస్కరించుకొని, భగవానుని శ్రీచరణాలను సేవించి) అనే నమ్మాళ్వార్ల సూక్తికి అనుగుణం.

ఈడువ్యాఖ్యలో ఈ రెండు అర్థనిర్వాహాలు తెలుపబడినా, పేర్లు ఉట్టంకింపబడలేదు.

ఆఱాయిరప్పడి, ఒన్బదినాయిరప్పడి వ్యాఖ్యలలో శ్రీరామానుజుల నిర్వాహానుసారంగా వివరింపబడింది. పన్నీరాయిరప్పడిలో ఆళవందార్ నిర్వాహానుసారంగా వివరింపబడింది.

ఇక్కడ వ్యాఖ్యానంలో స్పష్టంగా తెలుపబడకపోయినా "నేమిప్పిరాన్ తమర్" (చక్రధారి భక్తులు) అనే పదానికి ఆళవందార్ నిర్వాహంలో - నిత్యసూరులని, భగవద్రామానుజుల నిర్వాహంలో శ్రీవైష్ణవులని అర్థమని అరుంబదాలలో వివరింపబడింది.

**(23) (5-3-6) ఈడు వ్యాఖ్య**

**(వలైయుళ్ అకప్పట్టేన్) "ఆళ్వార్ తిరువరఙ్గ ప్పెరుమాళ్ అరైయర్ వలైయాక**

**అభినయిత్తు ప్పాదానిఱ్క, తిరుక్కణ్‌కళై క్కాట్టియరుళినార్, ఎమ్బెరుమానార్”**

**(వలైయుళ్ అకప్పట్టేన్)** – “ఆఴ్వార్ తిరువరఙ్గ ప్పెరుమాళ్ అరైయర్ అనే ఆచార్యులు ఈ సూక్తిని అనుసంధించినపుడు చేపలను పట్టే **“వల”** అని అర్థం వచ్చేటట్లు సైగచేస్తూ అభినయించారు. శ్రీరామానుజులు దానిని చూచి, తమ కన్నులను చూపి, కళ్ళు అనే వల – అని అర్థం వచ్చేటట్లు అభినయించాలని సూచించారు).

**“వాశుదేవన్ వలైయుళ్ అకప్పట్టేన్”** (వాసుదేవుని వలలో చిక్కుకొన్నాను) అనే ఆఴ్వార్ల సూక్తిని వివరిస్తూ నమ్బిళ్ళై శ్రీరామానుజులకు చెందిన ఈ ఐతిహ్యాన్ని ఉదాహరించారు. “వలైయుళ్ అకప్పట్టేన్” – అనే ప్రయోగాన్ని అప్పోదు వానతిల్ అన్టిక్కే అవన్ ఎగ్నైక్కుఱిత్తునోక్కిన నోక్కిలుమ్, స్మిత త్తిలుమన్ట్రో నానక ప్పట్టదు” (సౌందర్య సౌలభ్యాదులైన అందఱిని ఆకట్టుకొనే గుణాలలో కాకుండా, అతడు నన్ను చూచిన చూపులో, చిఱునవ్వులో చిక్కుకొన్నాను) అని వివరించిన నమ్బిళ్ళై, “వలై” అంటే – కటాక్షస్మితాదులనే అర్థం వస్తుందా? అనే శంకను ఈ ఐతిహ్యంతో సమాధానించారు. ఆఱాయిరప్పడిలో గుణసామాన్యంగానే గ్రహించి, **“కల్యాణ గుణఙ్గళాకిఱ వలైయుళ్”** (కల్యాణ గుణాలనే వలలో) అని వివరించారు. పన్నీరా యిరప్పడిలో “ఆకర్షక చేష్టిత రూపమానవలెక్కుళ్ళే” (ఆకర్షించే కలలు, రూపం అనే వలలో) అని **“వీక్షిత గుణచేష్టితాదికళా కిఱవలైయుళ్ళే”** అని ఒన్బది నాయిరప్పడిలో వివరింపబడింది. ఇరుపత్తు నాలాయిరప్పడిలో శ్రీరామానుజ సూక్తికి అనుగుణంగా వివరింపబడింది.

ఇక్కడ ఆఴ్వార్లు తాము చిక్కుకొన్న వల అని పల్కినది వాసుదేవుని నేత్రాలను గూర్చి – అని తెలుపడంకోసమే శ్రీరామానుజులు తమ కళ్ళను చూపించారు. అంటే – **“వలై”** అనే పదానికి అభినయం చేసేటపుడు కన్నులను చూపించాలని తాత్పర్యం. ఈ విధంగా శ్రీరామానుజులు **“వలై”** అనేటపుడు కళ్ళను చూపిస్తూ అభినయించాలని సూచించడానికి నియామకం (సూచకం) ఏది? అంటే, **“కార్త్తణ్ కమలకణ్ణెన్నుమ్ నెడుమ్ కయిఱు పడుత్తెన్నై యీర్త్తుకొణ్డు విళైయాడుమ్ ఈశన్”** (మేఘంలో శ్రమను హరించే, తామర పూచినట్లుండే తిరునేత్రాలనే

పాశంతో నన్ను బంధించి, ఆకర్షించి, కీడించే స్వామి) అనే గోదాదేవి సూక్తి నియామకం.

**"నెడుమ్ కయిఱు"** (పొడుగైన వల) కనుక చిక్కు కోకుండా తప్పుకొనే అవకాశం లేదు. **"కార్త్తణ్ కమలకణ్ ఎన్నుమ్"** – అని అన్నందున ఈ వల మిగిలిన పాశాలవలె కాకుండా, అనుకూలంగా భాసిస్తుంది కనుక, సులభంగా చిక్కకొంటారని తెలుపబడింది. నమ్పిళ్ళై అయితే **"వలై"** – అనే పదానికి – చిఱునవ్వు అనే వల – అనే అర్థాన్ని కూడా సూచించారు.

ఈ ఐతిహ్యం ద్వారా శ్రీరామానుజుల ఆ*ழ*్వార్ల సూక్తులలోని అవగాహన ఎంత గాఢమైనదో, వారి నిర్వాహాలు ఎంత ఆలంకారికంగా ఉంటాయో తెలుస్తున్నది. అంతేకాక దివ్యసూరి సూక్తులలోని ఐక కంఠ్యానికి కూడా ఈ నిర్వాహం ఒక దృష్టాంతం.

ఈ విధంగా అరైయర్ చేసే అభినయాన్ని సరిదిద్దుతూ ఎమ్బార్ చేసిన సూచనను గూర్చిన ప్రస్తావన ఒకటి కన్పిస్తుంది. **"అప్పూచ్చి కాట్టుకిన్ఱాన్"** అనే పెరియా*ழ*్వార్ తిరుమొ*ழ*ి ప్రయోగాన్ని అభినయిస్తూ ఉయ్న్ద పిళ్ళై అనే ఆచార్యులు అప్పూచ్చి అనే అర్థానికి – తమ కళ్ళను చికిలిస్తూ (చిన్నవి చేసి చూపిస్తూ) అభినయించగా, అపుడు శ్రీరామానుజుల వెనుకనే ఉన్న ఎమ్బార్ తమ హస్తాలను, భుజాలను చూపుతూ, శంఖచక్రాలను స్వామి ధరించిన విషయాన్నే ఆ*ழ*్వార్లు ఈ ప్రయోగం ద్వారా వ్యక్తం చేశారనే సంగతిని సూచించారు.

## (24) (5-10-4) ఈడు వ్యాఖ్య

**( వెళ్ళైనీర్ – ఇత్యాది ) ఇదు ఆళవన్దార్ అరుళిచ్చెయ్దారాక త్తిరుమాలై యాణ్డాన్ పణిక్కుమ్బడి. "బ్రహ్మరుద్రర్కళ్ నడువే నిన్ఱదొరు ముదల్ కళవుణ్ణు, అత్తై చ్చొల్లుకిఱదు" – ఎన్ఱాయి*ఱ్ఱ*ు. అదావదు – రుద్రనైయుమ్, తన్నైయుమ్ సమమాక చ్చొల్లలామ్బడి త్రిమూర్తిమధ్యస్థితియై చ్చొల్లుకిఱదెన్ఱు. ఇత్తై ఎమ్బెరుమానార్ కేట్టరుళి, "అ*ழ*కిదు, ఆనాలుమ్ విషయత్తిలే మున్బు పణ్ణిన ఉపకారత్తుక్కు ఓరళవుణ్డో! ఇదుతాన్ అమైయాడో!" ఎన్ఱు అరుళిచ్చెయ్దార్!**

**(వెళ్ళెనీర్ – ఇత్యాది** – దీనికి ఆళవందార్ ఈ వివరణం పలికారని తిరుమాలై యాణ్డాన్ పల్కిన రీతి (ఏమంటే) – బ్రహ్మరుద్రుల నడుమన వేంచేసి ఉండే విష్ణువనే మొదటి అవతారమున్నది. దానిని పల్కుతున్నారు – అని. దీని భావ మేమంటే – రుద్రుని, తనను సమంగా చెప్పదగినట్లుండే భగవానుని త్రిమూర్తి మధ్యస్థితి చెప్పబడుతున్నది – అని. దీనిని శ్రీరామానుజులు విని," బాగున్నది. అయినా ఇంత దూరం అన్వేషించి వెళ్ళాలా? ఇతని (రుద్రుని) విషయంలో పూర్వం చేసిన ఉపకారాలకు ఒక అవధి ఉన్నదా? ఇదే చాలదా!" – అని అన్నారు.

**"వెళ్ళెనీర్ చ్చడైయానుమ్ నిన్నిడై వేఱలామై విళఙ్గ నిన్టదుమ్"** (గంగాజలాన్ని జటలలో కల రుద్రుడు నీకంటే వేఱుకానట్లు అతనితో నీవు సమానమని తోచేటట్లుగా నిలచినది) అని ఆ*ఝ్వా*ర్లు పల్కి సూక్తిని వ్యాఖ్యానించే నమ్బిళ్ళై, ఈడు వ్యాఖ్యలో ఆళవన్దార్, శ్రీరామానుజులు చేసిన రెండు నిర్వాహాలనుగూర్చి పైవిధంగా ప్రస్తుతించారు.

ప్రకృత పాశురంలోనే ముందుగా **"కళ్ళవేడత్తై క్కొణ్డుపోయ్ పురమ్ పుక్కవాఱుమ్"** (మాయావేషాన్ని ధరించి త్రిపురాలలో ప్రవేశించిన రీతి) అని త్రిపురాలను శివుడు దహించడానికి భగవంతుడు చేసిన సహాయం చెప్పబడింది. ఈ విధంగా శివునకు స్వామి చేసిన ఉపకారాలు లెక్కలేనివి. శివుడు చేసే ఏ గొప్ప కార్యమైనా భగవానుడు అంతర్యామిగా ఉండి శక్తినిచ్చి చేయించాడు. అయితే, అవి అన్నీ శివుడే చేశాడని లోకం అంతా భావించేటట్లు తన పరత్వం వెల్లడి కాకుండా ఉన్నాడు. శివునికంటే భగవానుడు వేఱు కాదనే విషయం (భగవానుడు ప్రకారి, శివుడు ప్రకారమనే ప్రకారి – ప్రకార రూపమైన ఐక్యం) తెలుపడానికి పాశురంలో ప్రస్తావించిన ఈ త్రిపురాసుర వృత్తాంతమే చాలదా? శివునకు అంతర్యామిగా ఉండి కదా ఆ కార్యాన్ని చేయించాడు – అనేది శ్రీరామానుజ నిర్వాహతాత్పర్యం.

శ్రీరామానుజ నిర్వాహతాత్పర్యం న్నినమ్బిళ్ళై "గంగాజలత్తైత్తన్ జటైయిల్ ఏకదేశత్తిలే ధరిత్త ప్రభావత్తైయుడైయ రుద్రనుమ్ ఉన్పక్కల్ వేఱల్లాద పడితో( ) నిన్టమైయుమ్ – అదాకిఱదు, శరీర భూతన్ – ఎన్ను మిడమ్తో ( )నిన్టపడి"

(గంగాజలాన్ని తన జటలిలోని ఏదో ఒకచోట ధరించిన గొప్పతనాన్ని కల రుద్రుడు కూడ నీకంటే వేఱుకానట్లుగా తోచేటట్లు నిలుపడం – అని అర్థం. అంటే – రుద్రుడు నీకు శరీర భూతుడనే అర్థం స్ఫురిస్తున్నది) అని వివరించారు. దీనికి ప్రమాణంగా త్రిపురాసుర వృత్తాంతం గ్రాహ్యమని అరుంబద వివరణం. ఈ విధంగా గ్రహించకపోతే "విష్ణురాత్మా భగవతోభవస్యామితతేజసః" (భారతమ్ కర్ణ పర్వమ్)) (గొప్ప తేజస్సు కల, మహనీయుడైన శివునకు విష్ణువు ఆత్మ) అనే ఉప బృంహణ వచనానికి, "నలమ్ తిక()శడైయాన్ ముడిక్కొన్జైమలరామ్ నారాణన్ పాదత్తు( )యుమ్ నలిన్టి() వుకలాల్‌పదుకజై" (భగవానుని శ్రీచరణాలకు అభిషేకించిన తీర్థాన్ని ధరించిన గొప్పతనం ప్రకాశించే జటలను కలవాడైన రుద్రుని శిరస్సులోని గన్నేరు పూలు, ఆరుద్రునకు శేషి, శరీరి అయిన నారాయణుని శ్రీచరణాల లోని తులసి అనే ఈరెండు ప్రవహించి కొట్టుకొని వచ్చే జలం ఆకాశం నుండి భూమిపై పడి ప్రవహించే ప్రవాహాన్ని కల్గిన గంగ" (పెరియతిరు) అనే దివ్యసూరి సూక్తికి విరోధం వస్తుంది. ఉదాహృత భారతసూక్తిలో నారాయణుడు శరీరి అని, శివుడు శరీర భూతుడనే విషయం స్పష్టంగా ఉన్న, ఆళ్వార్ల శ్రీసూక్తిలో ఆ అర్థం ఎక్కడ ఉన్నది అంటే, ఆ అర్థం నారాయణ పదం ద్వారా ఆళ్వార్లు స్ఫురింపజేశారు. నారాయణ శబ్దానికి పలికే బహువ్రీహి సమాసం ద్వారా శరీరి అనే అర్థం, తత్పురుష సమాసం ద్వారా శేషి అనే అర్థం చెప్పబడుతున్నది కదా! ఈ విధంగా శ్రీరామానుజుల అర్థనిర్వాహం ఉభయవేదాంత సమన్వయాత్మకం. ఇంతేకాక, పాశురంలోని పురుషోత్త శబ్దం ద్వారా "ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః, యోలోకత్రయమా విశ్వబిభర్త్వ వ్యయఈశ్వరః" (ఉత్తమ పురుషుడు పురుషుల కంటే – జీవుల కంటే విలక్షణుడు. అతడు పరమాత్మ అని చెప్పబడుతున్నాడు. అతడు ముల్లోకాలలో వ్యాపించి భరించే వాడు, వికార రహితుడు, ఈశ్వరుడు అనే గీతా శ్లోకం ద్వారా తెలుపబడిన శేషిత్వ, శరీరత్వాలు సూచింపబడ్డాయి కదా! "శలమ్బొతియుమ్" ఇత్యాదిగా పాశురం పూర్వార్థంలో ప్రస్తావింపబడిన త్రివిక్రమ వృత్తాంతం వల్ల కూడా శేషిత్వం సూచితం.

**"నిన్నిడై"** – అనేదానికి ఆళవందార్ నిర్వాహంలో – నడుమ – అని, శ్రీరామానుజుల నిర్వాహంలో – అంతర్యామిగా – అని అర్థం. శ్రీరామానుజుల

నిర్వాహం పాశురంలోని పూర్వార్థానికి అనుగుణం. కనుక, ప్రకరణాను గుణ మనేది స్పష్టం.

ఆళవందార్ నిర్వాహానుగుణంగా భట్టర్ శ్రీంగరాజస్తవోత్తరశతకం లోని **"మధ్యే విరించిగిరిశం ప్రథమావతారః"** ఇత్యాది శ్లోకం అనుసంధేయం. ఇరుపత్తు నాలాయిరప్పడిలో కూడా ఈ రెండు నిర్వాహాలు తెలుపబడినా, నామ నిర్దేశం చేయబడలేదు. పన్నీరాయిరప్పడిలో, ఒన్బదినాయిరప్పడిలో శ్రీరామానుజ నిర్వాహాను సారంగా వివరింపబడంది.

**(25) (6-1-10) - ఈడు - అవతారిక**

**"శిల వణ్డుకళై క్కణ్డిత్తు – అవర్ ఇత్తలైయిల్ సత్తైయు మిల్లై – ఎన్ఱిరుప్పర్. అవళుమ్ ఉళళ్ – ఎన్ఱు శొల్లుజ్గోళ్ – ఎన్గిఱాళ్" – ఎన్ఱు అళవందార్ అరుళిచ్చెయ్ వర్. ఇత్తలై యిల్లైయాకిల్ అత్తలై యుణ్డాకక్కూడాదు. "పెణ్ పిఱన్దార్ కారియ మెల్లామ్ శెయ్దోమ్" ఎన్ఱు కృతకృత్యరాయిరుక్కిఱవర్క్కు రక్ష్యవర్గత్తిలే నాను మొరుత్తి ఉణ్డెన్ఱు శొల్లుజ్గోళ్ – ఎన్గిఱాళ్" – ఎన్ఱు ఎమ్బెరుమానార్ అరుళిచ్చెయ్వర్.**

(తుమ్మెదలను కొన్నింటిని చూచి, "తనను విశ్లేషించినవారెవరూ జీవించే అవకాశం లేదని తలచిన స్వామి – నాకు సత్తకూడా లోపించింది; నేను జీవించి లేను – అని భావించి ఉంటాడు, అందువల్లనే మళ్ళీ రాలేదు. అయితే అతనితో – ఆమెకూడా ( నేను కూడా ) ఉన్నది అని చెప్పండి – అని పరాంకుశ నాయకి పల్కుతున్నది – అని ఆళవందార్ ప్రకృతంలో అర్థాన్ని తెలిపారు. "పరాంకుశ నాయకి జీవించి ఉండక పోతే, నాయకుడైన స్వామి జీవించి ఉండే అవకాశం లేదు. "స్త్రీ జన్మను పొందిన వారి (స్త్రీల) కార్యాన్ని అంతటిని నిర్వర్తించాము" – అని కృతకృత్యునిగా తలచిన స్వామికి, రక్ష్యవర్గంలో నేనొకతెను ఇంకా మిగిలి ఉన్నానని చెప్పండి – నాయకి అని పల్కుతున్నది– అని శ్రీరామానుజులన్నారు.

**(26) (6-1-10) ఈడు వ్యాఖ్య**

**ఆళవందార్ అరుళిచ్చెయ్దదాక త్తిరుమాలై యాణ్డాన్ పణిక్కుమ్బడి – "ఇత్తలైయై ప్పిరిన్దారిల్ ఇరుప్పారిల్లై" – ఎన్ఱు ఇరుక్కైయాలే వారాదొழిన్దార్, అత్తనై.**

**ఇత్తలైయిల్ సత్తై ఉళ్ళమైయై అఱివియుజ్గోళ్" – ఎన్ను. ఇత్తై ఎమ్బెరుమానార్ కేట్టరుళి, "అ*ఝ*కిదు, అకిలుమ్ "ఇన్టియమైయామై" ఎన్ను తమి*ఝ*రకొరు ప్రవాద ముణ్డు. అదాకిఅదు – ఒరు తలై యుణ్డానాల్ ఒరు తలై ఇన్టిక్కేయిరాదు. ఇరణ్డు తలై యుమ్ ఉణ్డాదల్, ఇరణ్డు తలైయుమ్ ఇన్టిక్కే ఒద*ఝి*ల్, అత్తనై యాయి*గ్గ్రు* అదిల్, తామ్ ఉళర్ ఆకైయాలే అత్తలైయుమ్ ఉణ్డు ఎన్గై నిశ్చితమ్. ఆన పిన్బు ప్రతి కూలిత్తారై క్కి*ఝ*జ్గెడుత్తు ప్పొకట్టు, అనుకూలిత్తార్ తలైయిలే ముడియైవై త్తు కృతకృత్యరాయ్, "ఇని కర్తవ్య శేషమిల్లై" ఎన్ను ఇరుక్కిఱవర్క్కు "ఇన్నముమ్ రక్ష్యవర్గమ్ ఒన్ను ఉణ్డు" – ఎన్ను శొల్లుజ్గోళ్ – ఎన్ను".**

**"ఎన్నైయుమ్ ఉళన్ ఎన్మిజ్గళ్"** అనే తిరువాయ్ మొ*ఝి* సూక్తిని వివరిస్తూ. ఆళవందార్ పల్కినట్లుగా తిరుమాలైయాణ్డాన్ ఈ విధంగా అన్నారు – "నన్ను విశ్లేషించినవారిలో జీవించి ఉండేవారెవరూ లేరు" అని భావించినందున స్వామి రాలేదు, అంతే నాలో ఇంకా సత్త ఉన్నదని తెలుపండి" అని. (ఆళవందార్ అన్నారు)

దీనిని శ్రీరామానుజులు విని, "ఈ అర్థం బాగున్నది". కాని, **"ఇన్టియమై యామై"** అని ద్రావిడ సంప్రదాయంలో ఒక ప్రవాదమున్నది. దీని భావమేమంటే – నాయకీ నాయకులు ఇద్దరిలో ఒకరు జీవించి ఉంటే, ఇంకొకరు కూడా జీవించ కుండా ఉండరు.

ఇద్దఱూ జీవించ ఉండడమో, లేక, ఇద్దఱూ జీవించి ఉండకపోవడమో జరుగుతుంది, అంతే ఇద్దటిలో, తాను (భగవంతుడనే నాయకుడు) ఉన్నందున తాను కూడా జీవిలోని ఉండడం నిశ్చితం. అందువల్ల, శత్రువులను (రావణాదులను) దుంపనాశనం చేసి – సమూలంగా పెళ్ళగించి వేసి – భక్తుల (సుగ్రీవ, విభీషణాదుల) తలలపై కిరీటాన్ని పెట్టి, కృతకృత్యుడై, "ఇక నాకు కర్తవ్యమేమీ మిగుల లేదు" అని భావించేవానికి, "ఇంకా రక్ష్యవర్గంలో ఒకరున్నారు" అని చెప్పండి – అని శ్రీరామానుజులన్నారు)

భగవానుని ఉద్దేశించి పరాంకుశనాయకి **"ఏఱుశేవకనాఱ్కు ఎన్నైయు ముళళ్ ఎన్మిజ్గళ్"** అని సందేశాన్ని పంపిన సూక్తిని ఆళవందార్, శ్రీరామానుజులు వివరించిన రీతులను (నిర్వాహాలను) నమ్బిళ్ళై ప్రస్తావించారు.

**"ఉళళ్ – ఎన్మిఙ్గళే"** (ఆమె జీవించి ఉన్నదని చెప్పంది) అని అనడానికి ఏదో ఒక హేతువు ఉండాలి కదా! అందువల్ల "అతడు – నేను జీవించి ఉండను– అని తలచి ఉంటాడనే హేతువును భావించి ఆళవందార్ అర్థనిర్వాహాన్ని చేశారు. అందువల్ల **"ఉళళ్"** అనే పదానికి వీరి నిర్వాహంలో స్వారస్యం మెండు. శ్రీరామానుజుల నిర్వాహం **"ఏఱు శేవకనాఱ్కు"** అనే ప్రయోగాన్ని **"ఎన్నైయుమ్"** అనే ప్రయోగంలోని **"ఉమ్"**ను (చకారాన్ని) దృష్టిలో పెట్టుకొని చేయబడింది. యుద్ధంలో, రావణుని ఆజ్ఞానుసారం విద్యుజ్జిహ్వుడనే రాక్షసుడు మాయతో శ్రీరాముని సృష్టించి సీత ముందుకు తీసికొని వచ్చి, కత్తితో నఱికినపుడు సీత మూర్ఛపోయిందే కాని, మరణించలేదేమి? అనే సందేహాన్ని భట్టర్ "వాస్తవానికి శ్రీరాముడు చనిపోలేదు. కనుకనే సీతాదేవి సత్తను కోల్పోలేదు" అని సమాధానించిన విషయం స్మరణీయం. ఇక్కడ కూడా శ్రీరామానుజులు **"ఏఱుశేవకనాఱ్కు"** అనే ప్రయోగం శ్రీరాముని నిర్దేశిస్తుంది కనుక, దానిని దృష్టిలో పెట్టుకొని **"ఇత్తలైయిల్లై యాకిల్ అత్తలై యుణ్డాక క్కూడాదు"** అనే వివరణను ప్రసాదించారు. అదేవిధంగా "సీతాదేవిరక్షణమనే కార్యాన్ని నిర్వహించినంత మాత్రంలో అందఱి ఆడవారి కష్టాలన్నిటినీ తీర్చినట్లు కాదు. నేనొకతెను ఇంకా మిగిలి ఉన్నాను – అనే అర్థంలో చకారాన్ని (**'ఉమ్'**ను) వివరించారు. అందుచేత శ్రీరామానుజుల నిర్వాహంలో ఈ రెండు పదాలకు స్వారస్యం మెండు. ఆళవందార్ నిర్వాహంలోని **"సత్తైయుమ్ ఇల్లై"** అనే సూక్తిలో గల **"ఉమ్"** కు "లావణ్య కాంత్యాదులు లోపించినట్లే నా సత్త కూడా లోపించిందని స్వామి భావించి ఉంటాడు. అయితే సత్త మాత్రం ఇంకా మిగిలి ఉన్నదని తెలుపండి" అనే అర్థం అనుగ్రహింపబడింది.

శ్రీరామానుజులు పల్కిన ఈ నిర్వాహానికి మూలం – **"మాఱిల్ పోరరక్కన్ మదిల్ నీఱెழ*చ్చెఱ్ఱు*కన్ద ఏఱు శేవకనార్"** (సాటిలేని యుద్ధాన్ని కల రాక్షసుడైన రావణుని కోటలు భస్మం చేసి, ఆనందించిన గొప్ప పరాక్రమ శాలి) అనే ఆ*ழ*్వార్ల సూక్తి. **"అభిషిచ్య చ లంకాయాం రాక్షసేంద్రం విభీషణమ్, కృతకృత్య స్తదా రామో విజ్వరః ప్రముమోద"** (రాక్షస రాజైన విభీషణుడు లంకకు పట్టాభిషిక్తుని చేసి, రాముడు క్లేశం తీరినవాడై, చాలా ఆనందించాడు) అనే శ్రీరామాయణ సూక్తి, **"ఏఱుశేవకనార్"** అనే బిరుదు సార్థకం కావాలంటే నన్ను రక్షించినపుడే అది

సిద్ధిస్తుంది – అనేది హృదయం. ఇరుపత్తు నాలాయిరప్పడివ్యాఖ్యలో కూడా ఈ రెండు నిర్వాహాలు ప్రస్తావింప బడ్డాయి.

ఆళవందార్ నిర్వాహంలో "ఉళళ్" అనేపదానికి స్వారస్యం. "ఎన్నైయుమ్" అనే పదంలోని "ఉమ్"కు (చకారానికి), "మాఱిల్పోర్... ఏఱుశేవకనార్" అనే ప్రయోగానికి స్వారస్యం లేదు. శ్రీరామానుజుల నిర్వాహంలో చకారానికి ఈ ప్రయోగానికి స్వారస్యమున్నది. "ఉళళ్" అనేపదానికి స్వారస్యం లేదు. "ఉళళ్" ఎన్మిఙ్గళే" (ఉన్నది – అని చెప్పండి) అని ఉన్నందున ఈ విధంగా పరాంకుశ నాయకి పల్కడానికి ఏదో ఒక కారణం ఉండి ఉండాలని తలచి ఆళవందార్ నిర్వాహం చేయబడింది. ఈ నిరాహంలో "ఎన్నైయుమ్" అనే పదానికి లావణ్యాదులు లేకుండా పోయినట్లుగా సత్తా కూడా లేదని భావించి ఉండవచ్చు. నా సత్త ఉన్నదని చెప్పండి – అని భావం. కనుక "ఉమ్"కు స్వారస్యం లేదు.

పన్నీరాయిరప్పడిలో ఈ రెండు నిర్వాహాలు తెలుపబడిన నామ నిర్దేశం చేయబడలేదు. ఇరుపత్తు నాలాయిరప్పడిలో నామనిర్దేశ పూర్వకంగా రెండు నిర్వాహాలు ప్రస్తావింపబడగా, ఒన్బది నాయిరప్పడి, ఆఱాయిరప్పడి ర్యాఖ్యలలో శ్రీరామానుజ నిర్వాహానుసారం వివరింపబడింది. ఈ నిర్వాహాన్ని బట్టి శ్రీరామానుజులకు ద్రావిడాలంకార ప్రక్రియలలో గల గాఢమైన అవగాహన స్పష్టపడుతున్నది.

**(27) (6–5–7) – ఈడు**

**(ఇవళ్ నాయనకళ్ తిరున్దనవే) భట్టర్ – "అழகియమణవాళ ప్పెరుమాళ్" ఎన్హాల్ తిరునామమ్ నిఱమ్ పెరుమాపోలేయుమ్, శోమాశియాణ్డాన్ "ఎమ్బెరు మానార్" ఎన్హాల్ తిరునామమ్ నిఱమ్ పెరుమాపోలేయుమ్, అనన్దాழ்వాన్ "తిరువేఙ్గడ ముడైయాన్" ఎన్హాల్ తిరునామమ్ నిఱమ్ పెరుమాపోలేయుమ్.**

(**ఇవళ్ వాయనకళ్ తిరున్దనవే** – పరాశర భట్టర్ **"అழகియమణవాళ ప్పెరుమాళ్"** అనే నామాన్ని ఉచ్చరిస్తే అది ప్రకాశాన్ని పొందేటట్లు, శోమాశియాణ్డాన్ అనే ఆచార్యులు **"ఎమ్బెరుమానార్"** అనే నామాన్ని ఉచ్చరిస్తే అది ప్రకాశాన్ని

పొందేటట్లు, అనన్దాళ్వాన్ **"తిరువేఙ్గడముడైయాన్"** అనే నామాన్ని ఉచ్చరిస్తే అది ప్రకాశాన్ని పొందినట్లు)

ఈ నామాలను ఉచ్చరించిన ఆచార్యులు ముగ్గురు ఈ నామాలతో నిర్దేశింపబడే శ్రీరంగనాథుడు, శ్రీరామానుజులు, శ్రీవేంకటేశ్వరుడు – అనే వీరిపట్ల అత్యంత ప్రాపణ్యాన్ని కలవారైనందున, ఈ నామాలను వీరు ఉచ్చరించినపుడు ఒకవిధమైన అతిశయం స్ఫురిస్తుందని అభిప్రాయం. చాలా హార్దంగా ఈ నామాలను వీరు అనుసంధించేవారని తాత్పర్యం. పాశురంలో "తిరున్దన" – ప్రకాశాన్ని పొందాయి – అని భావం.

ఈ ఐతిహ్యామే పెరియ తిరుమొళ్ళి (5–5–1) పాశుర వ్యాఖ్యలో, తిరునెడున్దాణ్డకమ్ – 27వ పాశుర వ్యాఖ్యలో కూడా పెరియవాచ్చాన్ పిళ్ళై ద్వారా ప్రస్తావింపబడింది.

భగవత్ ప్రావణ్యం కలవారు ఉచ్చరించిన భగవన్నామం ప్రకాశాన్ని పొందుతుందనే విషయానికి ఉదాహరణగా నమ్పిళ్ళై, శ్రీరామగుణాలపట్ల అత్యంత ప్రావణ్యాన్ని కల నారద భగవాన్‌చేత **"యే త్వయా కీర్తితా గుణాః"** అనే విధంగా అత్యంత ప్రావీణ్యంతో పల్కబడి నందున, శ్రవణం చేయబడి నందున శ్రీరాముని గుణాలకు అపూర్వమైన ఉత్కర్ష కల్గిందని పలికారు. ఇక్కడ **"ఉక్తాః"** అని అనకుండా **"కథితాః"** అని అనడం వల్ల ఈ అర్థం స్ఫురిస్తున్నది.

**(28) (6–7–1) – ఈడు**

**(పుకుమూర్) – ఎమ్బెరుమానార్ తెఱ్కే ఎళ్ళున్దరుళానిఱ్క, ఎదిరే వరుకిఱాళ్ ఒరు పెణ్ పిళ్ళైయై క్కణ్డు "ఎఙ్గ నిన్ఱుమ్?" ఎన్న, "తిరుక్కోళూరిల్ నిన్ఱుమ్" ఎన్న, అవ్వూరిల్ పుక్క పెణ్‌గళుమ్ పోకక్కడవరాయ్ యిరుప్పార్‌కళో!" ఎన్ఱు అరుళిచ్చెయ్‌దార్.**

**"తిణ్ణమెన్నిళమాన్ పుకుమూర్ తిరుక్కోళూరే"** తిరుక్కోళూర్ అనే దివ్యదేశం పట్ల మిక్కిలి ప్రావణ్యాన్ని పొందిన పరాంకుశ నాయకి వెళ్ళే ఊరు తప్పక తిరుక్కోళూర్ అయి ఉంటుంది – అని ఆమె తల్లి పల్కింది. దివ్యదేశాలు ఈ సంసారమండల

జీవితమనే అగ్నిలో చిక్కుకొన్నవారికి చల్లని సరస్సు, చల్లని తోటవంటివి. అందుచేత, తిరుక్కోళూర్ ప్రవేశించే ఊరు తప్ప, బయటకు వచ్చే ఊరు కాదు – అని వివరిస్తూ వ్యాఖ్యాత నమ్పిళ్ళై ఒక అద్భుతమైన శ్రీరామానుజులకు సబంధించిన ఐతిహ్యాన్ని ప్రస్తుతించారు.

శ్రీరామానుజులు దక్షిణదేశ యాత్రగా వేంచేసేటపుడు, తమ కెదురు వచ్చిన ఒక కన్యను "నీవెక్కడ నుండి వస్తున్నావు?" అని అడిగారట. ఆమె "నేను తిరుక్కోళూర్ నుండి వస్తున్నాను" అని అన్నది. దానిని విని శ్రీరామానుజులు "తిరుక్కోళూర్ అనేది ప్రవేశించే ఊరే కదా! అక్కడ ఉండే కన్యలలో ఎవరైనా ఆ ఊరిని విడచి బయటకు రాగల్గినవారున్నారా! ఏమి!" అని అన్నారట. ఈ అర్థం "పోకుమార్" అని అనకుంటూ "పుకుమార్" అని అన్నందు వల్ల స్ఫురిస్తుంది. "పుకుమార్" ఎన్నైమూర్" ఎన్నైయాలే పుక్కార్ పోకుమూరన్ను అనే ఈడు వ్యాఖ్యలోని వాక్యం ద్వారా ఈవిషయం స్పష్టమవుతున్నది అంటే – ఆ ఊరిలో ప్రవేశించిన వారు అక్కడ ఉంటే ఉద్యానవనాల భోగ్యతను, అక్కడ వేంచేసి ఉండే స్వామి భోగ్యతను దర్శించిన తరువాత అక్కడ నుండి బయటకు వెళ్ళలేరు కనుక లోపలికివెళ్ళే ఊరే తప్ప, బయటకు పోయే ఊరుకాదని తాత్పర్యం.

ఈవిధంగా ప్రశ్నించిన శ్రీరామానుజులతో ఆ కన్య పల్కిన వార్తలే **"తిరుక్కోళూర్ పెణ్పిళ్ళై రహస్యమ్"** అనే గ్రంథంగా అవతరించిందని పెద్దలంటారు.

## (29) 7-2-10 – ఈడు

**(మూవులకు ఇత్యాది) "మూవులకాళియే, కడికమ*ల్ర్* కొన్దై చ్చడైయనే, నాన్ముక క్కడవుళే ఎన్నుమ్ వడివుడై వానోర్ తలైవనే! ఎన్నుమ్" ఎన్ను తిరుమాలై యాణ్డాన్ వైయధికరణ్యమాక్కి నిర్వహిక్కుమ్. ఎన్నుమ్ ఎన్నుమదు ఎన్నుమవనాయ్. ఇత్తై ఎమ్బెరుమానార్ కేట్టరుళి, సామానాధికరణ్యత్తిలే అరుళిచ్చెయ్దరుళినార్. త్రైలోక్యత్తుక్కుమ్ కడవనాన ఇంద్రనుక్కు అంతర్యామి యాక నిన్ను, అవనుడైయ అధికారత్తై నిర్వహిక్కిఱవనే! ఎన్నుమ్, పరిమళత్తై ఉడైత్తాన కొన్దైయై జటైయిలే ఉడై య రుద్రనుక్కు అంతర్యామియాయ్ నిన్ను, అవనుడైయ పదత్తై నిర్వహిక్కిఱవనే! ఎన్నుమ్, అవర్కళోడు, ఇవ్వరుకుళ్ళారోడు వాశియఱ ఎల్లార్క్కుమ్ నిర్వాహకనా**

**యిరుక్కిఱ చతుర్ముఖనాకిఱ దేవతైక్కు అంతర్యామియానవనే! ఎన్నుమ్"**

**(మూవులకు - ఇత్యాది)** - "ముల్లోకాధిపతీ! అని, సువాసనలు వెదజల్లే గన్నేరు పూలను జటలలో కలవాడా! అని, మంచి రూపాన్ని కల దేవతలకు అధిపతీ! అని" - అని ఈ విధంగా తిరుమాలై యాణ్డాన్ ఈ సంబోధనలను వైయధికరణ్యప్రక్రియలో అన్వయించి అర్థనిర్వాహాన్ని చేశారు. దీనిని శ్రీరామానుజులు విని, ఈ మూడు సంబోధనలను సామానాధికరణ్య ప్రక్రియలో అన్వయించి పలికారు. ముల్లోకా లకు నిర్వాహమైన ఇంద్రునకు అంతర్యామియై నిలచి, అతని అధికారాన్ని నిర్వహించే వాడా! అని, పరిమళాన్ని కల గన్నేరు. పూలను జటలలో కల్గిన రుద్రునకు అంతర్యామియై ఉండి అతని అధికార పదవిని నిర్వహించేవాడా! అని, వారితో, ఈ లోకంలో ఉండే వారితో తేడా లేకుండా అందఱికి నిర్వాహకుడై ఉండే చతుర్ముఖుడనే దేవతకు అంతర్యామియైన వాడా! - అని (శ్రీరామానుజులు అర్థాన్ని నిర్వహించారు)

పరాంకుశ నాయకి భగవంతుని ఉద్దేశించి, **"మూవుల కాళియే - ఎన్నుమ్, కడికమ___ కొన్టచ్చుడైయనే - ఎన్నుమ్, "నాన్ముకక్కడవుళే - ఎన్నుమ్, వడివుడై వానోర్‌త్తలైవనే ఎన్నుమ్"** - అని సంబోధిస్తున్నదని ఆమె తల్లి పల్కుతున్నది. దీనిని వివరించే నమ్బిళ్ళై ఈడు వ్యాఖ్యలో శ్రీరామానుజులు, తిరుమాలైయాణ్డాన్ (ఆళవందార్) పల్కిన నిర్వాహాలను ప్రస్తావించారు.

తిరుమాలైయాణ్డాన్ ఈ సంబోధనలను వైయధికరణ్యంలో - వేర్వేరు అర్థాలను తెలిపే పదాలుగా - గ్రహించి అర్థం చెప్పారు. **"మూవులకాళి, కడికమ___ కొన్టచ్చుడైయన్, నాన్ముక్కడవుళ్"** - అని చెప్పబడే **"వానోర్‌త్తలైవన్"** (నాథుడు) - అని నాయకి అంటున్నది అని వీరి వివరణం. ఈ వివరణంలో **"మూవులకాళియే"** (ఇంద్రుడు!), **"కడికమ___ కొచ్చుడైయనే!"** (శివుడు!), **"నాన్ముక క్కడవుళే"** (బ్రహ్మ!) అనే పదాలు ప్రత్యేక ప్రత్యేకంగా ఆయా దేవతలను నిర్దేశిస్తాయి. **"వానోర్ తలైవనే"** అనేది ఇటువంటి దేవతలకు నాథుడైనవాడా! అని భగవంతుని నిర్దేశిస్తున్నది- అని తిరుమాలైయాణ్డాన్ అర్థం చెప్పారు.

దీనిని ఆలకించిన ఎమ్బెరుమానార్, ఈ సంబోధనలకు సామానాధి కరణ్యంలో

(ఒకే అర్థాన్ని తెలిపే మూడు వేర్వేరు పదాలుగా) గ్రహించి, అర్థనిర్వాహాన్ని చేశారు. **“మూవుల కాళియే ఎన్నుమ్”** – ముల్లోకాలను ఏలే ఇంద్రునకు అంతర్యామియై, అతని అధికారాన్ని నిర్వహించే వాడా!, అని అంటున్నది, **“కడికమ*ళ్* కొన్దైచ్చడైయనే”** ఎన్నుమ్ – సువాసనను కల గన్నేరు పూలను జటలలో ధరించిన శివునకు అంతర్యామిగా నిలచి, అతని వృత్తి అయిన లయాన్ని నిర్వహించేవాడా! అని అంటున్నది, **“నాన్ముక్కడవుళే” ఎన్నుమ్** – చతుర్ముఖుడైన బ్రహ్మలు అంత ర్యామియై అతని కార్యమైన సృష్టిని నిర్వహించేవాడా! – అని అంటున్నది – అని మూడు అర్థాలను చెప్పారు. ఈ వివరణంలో **“మూవుల కాళియే కడికమ*ళ్* కొన్దైచ్చడైయనే, నాన్ముకక్కడవుళే”** – అనే పదాలు అన్నీ భగవానునే (అంతర్యామినే) నిర్దేశిస్తున్నవని భావం.

ఈ నిర్వాహంలో “మూవులకాళియే” కడికమళ్కొన్దైచ్చడైయనే”, “నాన్ముక క్కడవుళే” అన పదాలలోని ఏకారం “ఒన్ఱే, ఇరణ్డే, మూన్ఱే” అని లెక్కించేటపుడు ఉండే ఏకారం వంటిది. “ఎన్నుమ్” – అంటే అని చెప్పబడే అని అర్థం. “వానోర్” అనే పదం ఈ లీలావిభూతి లోని దేవతలను తెల్పుతుంది. “నాన్” అంటే స్వరమని అర్థం. “పడివుడై” – అందమైన రూపాన్ని కల అన్ని అర్థం. అయితే, తిరుమాలై యాణ్డాన్ నిర్వాహంలో – “మూవుల కాళియే” ఇత్యాదిగా పాశురంలోని పదాలను సంబోధికలుగా స్ఫురింపజేసే ఏకారాన్ని, “ఎన్నుమ్” – అనేపదం పరాంకుశ నాయకి తల్లి తన కుమార్తె పల్కిన మాటకు అనువదిస్తున్నదని స్ఫురింపజేసే అర్థాన్ని అనాదరించి, అర్థం చెప్పవలసి ఉన్నదని తలచిన శ్రీరామానుజులు పాశురంలోని ఇంద్రాది దేవతలను ముగ్గురిని తెలిపే పదాలను ప్రత్యేక సంబోధికలుగా గ్రహించి, సామానాధికరణ్యంలో అర్థం చెప్పారు. ఈ అర్థంలో విశిష్టాద్వైత సిద్ధాంత ప్రతి తంత్రార్థమైన శరీరి – శరీర భావం స్ఫురిస్తుంది. అంతేకాదు, “వడివుడై వానోర్ తలైవనే” అనేది కూడా ఒక ప్రత్యేక సంబోధన. దీనికి “నిరంజనః పరమం సామ్యము వైతి” అనే శ్రుతి ప్రక్రియలో తన దివ్యరూపంతో పోలిన దివ్యరూపాన్ని కల పరమపదవాసులను స్వామి – అని అర్థం. ఇక్కడ “వాన్” అనే పదం పరమాకాశమన బడే పరమపదాన్ని లక్షిస్తుంది. “యదక్షరే పరమేవ్యోమన్” అని శ్రుతి పరమపదాన్ని పమాకాశంగా పల్కింది. ఈ విధంగా శ్రీరామానుజ నిర్వాహంలో ఉభయ విభూతి

నాథత్వం కూడా స్ఫురిస్తుంది. తిరుమాలైయాన్డాన్ నిర్వాహంలో లీలావిభూతి శేషిత్వం మాత్రమే, అదికూడా, వైయధికరణ్య ప్రక్రియలో స్ఫురిస్తుంది. శ్రీరామానుజ నిర్వాహానికి "నాన్మకనే ముక్కణ్ణప్పా!" ఇత్యాది ఆళ్వార్ల ప్రయోగాలకు అనుకూలం.

ఆఱాయిరప్పడి, పన్నీరాయిరప్పడి, ఒన్బది నాయిరప్పడి, ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యలలో శ్రీరామానుజ నిర్వాహానుసారంగానే వివరింపబడింది.

అపర్యవసాన వృత్తి ద్వారా **"మూవుల కాళి"** ఇత్యాది సంబోధన త్రయం భగవత్పర్యంత వాచకాలు. ఆఴ్వార్లు **"మయర్వఱ మదినలమ్"**ను పొందినవారైనందున విశేషణాంశంలో (శివ, బ్రహ్మ, ఇంద్రాదుల వరకే) నిలువరు కదా!, వారి దృష్టి విశేష్యపర్యంతంగా (భగవత్పర్యంతంగా) ఉంటుంది కదా! అన్యాపదేశ ప్రక్రియలో సాగే ఈ దశకంలో సామానాధికారణ్యానికి ఉపయోగం లేదు కదా! – అంటే – భగవంతుడు సర్వనిర్వాహకుడనే విషయాన్ని చక్కగా తెలిసినవారు కదా ఆఴ్వార్లు. నాయకీ భావాన్ని పొందినా సర్వనిర్వాహకత్వాన్ని అనుసంధించడంలో లోటు లేదు కదా. అంతేకాక, శ్రీరామానుజుల అర్థనిర్వాహం విశిష్టాద్వైత సిద్ధాంత ప్రధాన ప్రతితంత్రార్థమైన శరీర శరీరి భావాన్ని పురస్కరించుకొని చేయబడడం గమనార్హం. తిరుమాలైయాణ్డాన్ నిర్వాహంలో **"కడికమఴ్"** దగ్గర నుండి ఆరంభించి **"వానోర్ తలైవనే"** వరకు ఏకవాక్యం. శ్రీరామానుజుల నిర్వాహంలో వేర్వేరు సంబోధనలు.

### (30) (7-2-10) – ఇరుపత్తు నాలాయిరప్పడి

**(అడియిత్యాది) "జీవిప్పారైప్పోలే యిరున్దు, ముడిన్దుకొడునిన్దాళ్"** ఎన్ఱు **పూర్వర్కళ్ నిర్వాహమ్, అఙ్గనేయానాల్, మేల్ ప్రబంధమ్ నడవాదు – ఎన్ఱు. "సంశ్లేషిక్కప్పెఱాళో! ఎన్ఱు తోన్ఱుమ్బడి అవసన్నైయాన ఇవళ్ కిట్టి సంశ్లేషిక్కప్పెన్ఱాళ్, కాలమేఘనిభశ్యామమాన పెరియపెరుమాళ్ తిరువడికళై" ఎన్ఱు ఎమ్బెరుమానార్ నిర్వహిత్తరుళినార్.**

తన కుమార్తె అయిన పరాంకుశ నాయకినిగూర్చి ఆమె తల్లి **"అడి అడైయాతాళ్ పోల్ ఇవళ్ అణుకి అడైన్దనళ్ ముకిల్వణ్ణనడియే"** (శ్రీ పాదాలను చేరలేనిదిగా ఉండే ఈమె సమీపించి, మేఘంవలె నల్లని వర్ణాన్ని కల స్వామి శ్రీచరణాలను

చేరింది) అని అంటున్నది. దీనిని వివరిస్తూ పెరియవాచ్చాన్ పిళ్ళై రెండు నిర్వాహాలను ప్రస్తావించారు. ఈడు వ్యాఖ్యలో కూడా ఈ రెండు ప్రస్తావింపబడినా పేర్లు ఎక్కడా నిర్దేశింపబడలేదు.

"ఈమె (నాయకి) ప్రాణం నిలిచేటట్లుగా కన్పించి, తటాలున సమసిపోయింది" అని తల్లి పల్కుతున్నట్లు శ్రీరామానుజులకు ముందున్న ఆచార్యులు పలికారు.

"ఆ విధంగా ఆழ్వార్ నాయకి ప్రాణాలు విడిస్తే తరువాత ప్రబంధం కొనసాగే అవకాశం లేదు. (7వ శతకం ద్వితీయ దశకంతోనే ప్రబంధం ముగిసేది పోయేది) అందువల్ల ఈమె ప్రాణాలు విడిచింది అని అనడం కుదరదు. భగవానుని శ్రీచరణాలను చేరలేదు! – అని భావించేటట్లుండే ఈమె, క్రమంగా కాలమేఘవర్ణుడైన శ్రీరంగ నాథుని చరణాలను చేరింది. (అంటే– భగవత్సంశ్లేషాన్ని పొందింది – కలసి అనుభవించే ఆనందాన్ని పొందింది) అనే అర్థాన్ని శ్రీరామానుజులు తెలిపారు. ప్రత్యక్షసంశ్లేషం కాదు. కాని, ఇదికూడా ఒక మానసానుభవవిశేషమే.

"ముకిల్‌వణ్ణకడియే అడైన్దళ్" – అనేదానికి సమసిపోయింది – అని పూర్వుల నిర్వాహంలో పరమాత్మ సంశ్లేషాన్ని పొందింది – అని శ్రీరామానుజుల నిర్వాహంలో అర్థం.

ఇక్కడ ఒక అద్భుతమైన ఐతిహ్యాన్ని అడైయవళైన్దాన్ అరుంబదకారులు ప్రస్తావించారు. తిరుమలలో ప్రతివాది భయంకరమ్ అణ్ణన్ వేంచేసి ఉండే కాలంలో వారివద్ద శ్రీభాష్యార్థాన్ని వినాలని బయలుదేరిన ఒక శ్రీవైష్ణవ స్వామి వారి వద్దకు బయలుదేరి దారి తప్పి, దిగ్భ్రమతో చాలా క్లేశపడి, దేవరవారి కృపవల్ల ఏదో ఒకవిధంగా మీ సన్నిధిని చేరగలిగాను" అని అన్నారట. అపుడు అణ్ణన్ చమత్కరిస్తూ **"అడి అడైయదాళ్‌పోల్ ఇవళ్ అణుకి అడైన్దనళ్"** అని ఆழ్వార్లు పల్కినట్లే, మీరు పెరుమాళ్‌ను సేవింపగలిగారే! అని అన్నారట.

శ్రీరామానుజుల నామోట్టంకనం ఈడు వ్యాఖ్యలో లేకపోయినా, ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యలో వారి పేరు స్పష్టంగా నిర్దేశింపబడింది.

**(31) (7-3-1) ఈడు**

(నెఞ్జినూడే) – "నఞ్జీయర్ కోయిలుక్కు ఎழுన్దరుళానిఱ్కు వழிయిలే పిళ్ళానై క్కణ్డు, "ఈశ్వరనుక్కు స్వరూపవ్యాప్తియో? విగ్రహవ్యాప్తియుమ్ ఉణ్డో?" ఎన్ఱు కేట్క, "భాష్యకారర్ తో గ్రన్దు అరుళిచ్చెయ్దు కొణ్డుపోన్దు స్వరూపవ్యాప్తియా యిరుక్కుమ్. ఆకిలుమ్, ఎమ్బార్ ఒరునాళ్ ఉపాసకానుగ్రహార్థమాక ఆశ్రితరుడైయ నెఞ్జిలే విగ్రహత్తోడే వ్యాపిత్తు ఇరుక్కుమ్" – ఎన్ఱు అరుళిచ్చెయ్య క్కేట్టేన్" ఎన్ఱు పణిత్తాన్

("పరేణ నాకమ్ నిహితం గుహాయామ్", "గహ్వరేష్ఠం పురాణమ్", "అరవత్త మళియనోడుమ్ అழగియ పాఱ్కడలోడుమ్ అరవిన్దప్పావైయుమ్ తానుమ్ అకమ్బడి వన్దు పుకుద్దు" ఎన్ఱుమ్, "యేషా మిందీవరశ్యామో హృదయే – సుప్రతిష్ఠితః "ఎన్ఱుమ్", "ఎన్నెఞ్జినూడే పుళ్ళై క్కడాకిన్ఱ" ఎన్ఱుమ్ శొల్లుకిఱపడియే)

"వెళ్ళైచ్చురిశఙ్గొడు ఆழி యేన్ది తామరైక్కణ్ణన్ ఎన్నెఞ్జినూడే పుళ్ళై క్కడాకిన్ఱ వార్త్తై క్కేణీర్" (తెల్లని, పురులను కల శంఖంతో పాటు చక్రాన్ని ధరించిన తామరస నేత్రుడు నా మనస్సులో గరుడుని నడిపే సంగతిని దర్శించండి) అని ఆழ్వార్లు పలికారు. ఈ రీతిలో భక్తుల మనస్సులో స్వామి సపరికరంగా వేంచేసి ఉంటాడనే విషయంలో నమ్బిళ్ళై ఈడువ్యాఖ్యలో ఒక సంభాషణ విశేషాన్ని ప్రస్తావించారు.

ఒకనాడు నంజీయర్ శ్రీరంగాలయానికి దర్శనార్థం వెళ్ళేటపుడు, దారిలో పిళ్ళాన్‌ను చూచారు. "భగవానుడు తన జ్ఞానానందాత్మకమైన స్వరూపంతో మాత్రం అంతటా వ్యాపిచి ఉంటాడా? లేక, తిరుమేనితో కూడా ఉంటాడా? అని నంజీయర్ పిళ్ళాన్‌ను ప్రశ్నించారు. దానికి బదులుగా పిళ్ళాన్ "శ్రీరామానుజులు తమ గ్రంథాలలో భగవానునకు స్వరూపవ్యాప్తినే అనుగ్రహించారు. అయినా, ఒక పర్యాయం ఎమ్బార్ "ఉపాసకులను అనుగ్రహించడంలోకం భగవానుడు వారి మనస్సులో తిరుమేనితో వేంచేసి ఉంటాడు" అని పల్కగా విన్నాను. అందుచేత భగవంతునకు విలక్షణవ్యక్తి విషయంలో విగ్రహవ్యాక్తి కూడా ఉంటుంది – అని అన్నారు.

( స్వర్గానికి ఆవలి వైపు, గుహలో ఉండేవాడు) అని, (గుహలో ఉండేవాడు, పురాణ పురుషుడు) అని, (ఆదిశేషశయనంతో, అందమైన క్షీరాబ్ధితో పాటు, లక్ష్మీదేవి

తాను హృదయంలోకి వచ్చి ప్రవేశించి) అని, (ఎవరి హృదయంలో నల్ల కలువ వర్ణాన్ని కల శ్రీరాముడు సుప్రతిష్ఠితుడుగా ఉంటాడో) అని, "నా మనస్సులో గరుడని నడిపే సంగతి) అని చెప్పబడినట్లే. పరమాత్మ విలక్షణవ్యక్తి విశేషంలో దివ్యమంగళవిగ్రహంతో సపరికరంగా వేంచేసి ఉంటాడు.

పైన ఉట్టంకింపబడిన ప్రమాణాలు భగవానుడు ఉపాసకుల హృదయాలలో దివ్యమంగళ విగ్రహంతో వేంచేసి ఉంటాడని తెల్పుతున్నాయి. భగవానుడు ఉపాసనకు అనుగ్రహించే ఫలాన్ని తెలిపే ప్రకరణంలో కూడా **"తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్"** (ఆ ఉపాసనకు పరమాత్మ తన విగ్రహాన్ని దర్శింపజేస్తాడు) అని ఆ దివ్యమంగళ విగ్రహమే ధ్యేయంగా చెప్పబడింది. ఈ విధంగా ఉపాసన వేళలో విగ్రహమే ధ్యేయంగా చెప్పబడినందున, ఫలదశలో అనుగ్రహించేదికూడా విగ్రహమే అయినందున, **"సదా పశ్యంతి"** అయిన ఆ*ழ*్వార్లకు విషయం కూడా విగ్రహమే కనుక, విగ్రహం కాల్పనికం కాదు, ఈ ఉపనిషత్తులు అన్నీ ద్రమిడ భాష్యకారులచే **"తస్యా ఉపాస్యాయా దేవతాయా రూప ముపదిశ్యతే"** ఇత్యాదిగా తెలుపబడ్డాయి. శ్రీవిష్ణుపురాణంలో విగ్రహానికి మించి స్వరూపమే ధ్యేయమని పల్కడం కూడా స్వరూపసద్భావాన్ని ప్రతిపాదించే దృష్టితోనే – అని అరుంబద వివరణం.

**(32) (7–9–1) – ఈడు**

**(ఎన్ శొల్లి నిఱ్పనో).... ఇదుక్కు ఆళవందార్ అరుళిచ్చెయ్యుమ్బడి. – "సర్వేశ్వరన్ శెయ్యప్పుక్కాల్ అరియదుమ్ ఒన్ఱు ఉణ్డో!" – ఎన్ఱామ్. అజ్ఞనన్ఱిక్కే, ఎమ్బెరుమానార్ "ఇవర్ తామ్ శొన్నారాకిలుమ్ ఒరుపడిపోక చ్చొల్లి త్తలైక్కట్టువర్. అవనుమ్ తానే శొన్నానావిల్ నిరవద్యమాయ్ తలైక్కట్టుమ్. శిఱు ప్రజై ఎ*ழ*ుత్తిడప్పుక్కాల్ తానే ఏదేనుమ్ ఒరుపడి ఇట్టు త్తలైక్కట్టుమ్. పితావాదల్, ఉపాధ్యాయనాతల్ ఇడప్పుక్కాల్ తానే ఎ*ழ*ుత్తాయిరుక్కుమ్. అజ్ఞనన్ఱిక్కే, ఇవన్ కైయై ప్పిడిత్తు, ఇడువిక్కప్పుక్కవాతే, ఇవన్ ఓరిడత్తిలే ఇ*ழ*ుక్క, అవన్ ఓరిడత్తే ఇ*ழ*క్క కుతఱిక్కొట్టియాయ్, రూపమ్ అ*ழ*ిన్దు, శిదఱిప్పోమ్, అప్పడియే ఎన్నై ఉపకరణమాక క్కొణ్డు కవిపాడానిఱ్కచ్చెయ్‌దేయుమ్, ఎన్నాల్ వరుమ్ దోషమ్ తన్ పక్కల్ స్పర్శియాదపడి పాడవిత్తాన్ – ఎన్గిఱార్" ఎన్ఱు.**

**“ఎన్నాల్ తన్నై ఇన్కవి పాడియ ఈశనై... ఎన్ శొల్లి నిఱ్పనో!”** (నాచే తననుగూర్చి తీయని పాశురాలను పాడించుకొన్న ఈశ్వరుని గూర్చి నేను ఏమని చెప్పను?) అని ఆ*ళ్వా*ర్లు పల్కిన సూక్తిని నమ్పిళ్ళై వ్యాఖ్యానిస్తూ ఆళవందార్, శ్రీరామానుజులు పల్కిన నిర్వాహాలను ప్రస్తావించారు.

చాలా నీచుడనైన నన్ను పురస్కరించుకొని కదా భగవంతుడు తననుగూర్చి కవిత్వాన్ని చెప్పించుకొన్నాడు. సర్వేశ్వరుడైన భగవానుడు ఏదయినా చేయాలని అనుకొంటె, అతనికి సాధ్యం కానిది అనేది ఉన్నదా? అందువల్ల చాలా నీచుడనైన నన్ను పురస్కరించుకొని తననుగూర్చి పాశురాలను పాడించుకొన్నాడు” అని ఆ*ళ్వా*ర్లు పల్కుతున్నారని – ఆళవందార్ నిర్వాహం.

ఈ విధంగా కాకుండా, శ్రీరామానుజులు వేఱొక చక్కగా రీతిలో అర్థం చెప్పారు. “ఆ*ళ్వా*ర్లే స్వయంగా పాడి ఉంటే ఏదో ఒక రీతిలో పల్కి ముగించి ఉండేవారు. భగవానుడే స్వయంగా పాడి ఉంటే ఏ దోషం లేకుండా పల్కి ఉండేవాడు. అయితే, ఈ రెండు రీతులలో కాకుండా నన్ను ముందుంచుకొని కదా అతడు పాశురాలను పాడించుకొన్నాడు. ఒక చిన్న బాలుడు తానే స్వయంగా దేనినైనా లిఖిస్తే, ఏదో ఒక విధంగా వ్రాసి ముగిస్తాడు. తండ్రి గాని, ఆచార్యుడు గాని వ్రాయడం ఆరంభిస్తే దానిని అందంగానే వ్రాస్తారు. అయితే, ఈ రెండు విధాలుగా కాకుండా, తండ్రిగాని, ఉపాధ్యాయుడు గాని, చిన్న బాలుని చేతిని పట్టుకొని రాయించడం ఆరంభిస్తే, బాలుడు ఒక పక్కకు లాగి, తండ్రిగాని, ఆచార్యుడు గాని వేఱొక పక్కకు లాగితే, అపుడు వ్రాసినది అక్షరరూపాన్నే పొందదు. గజిబిజిగా ఉంటుంది. రూపమనేదే లేకుండా పోతుంది. ఆ విధంగానే, భగవానుడు నన్ను పురస్కరించుకొని కవిత్వాన్ని పాడించుకొన్నప్పటికీ, నావల్ల ఏర్పడే దోషాలు ఏమీ తనను స్పృశించనట్లు చాలా అందంగా పాడించుకొన్నాడు కదా! – అని ఆ*ళ్వా*ర్లు పల్కుతున్నారని – శ్రీరామానుజులు అన్నారు. శ్రీరామానుజులు లౌకికోదాహరణలతో విషయాన్ని హృద్యంగా వివరించగల్గినవారనే దీనికి ఇది ఒక దృష్టాంతం.

ఇదే వివరణను ఎమ్బార్ పల్కినట్లుగా తిరువాయ్మొ*ళి*లోని (7–9–4)వ పాశురం ఈడు వ్యాఖ్యలో తెలుపబడింది. ఎమ్బార్ శ్రీరామానుజుల అంతరంగ

శిష్యులలో ఒకరైనందున శ్రీరామానుజులు పల్కిన వివరణనే వారుకూడా తెలిపి ఉండవచ్చు. ఇది ఆచార్యుల ఐకకంఠ్యానికొక దృష్టాంతం.

ఆళవందార్ పల్కిన నిర్వాహంలో "పాశురంలోని **"ఇన్‌తమి౯్ పాడియ వీశనై"** అనే ప్రయోగంలో దృష్టి. శ్రీరామానుజుల నిర్వాహంలో **"ఎన్నాల్ తన్నై ఇన్ తమి౯్ పాడియ"** అనేదానిలో దృష్టి. ఆళవందార్ నిర్వాహంలో **"ఈశన్"** అంటే – సమర్థుడని అర్థం. శ్రీరామానుజనిర్వాహంలో హేయప్రతిభటుడని అర్థం. "క్షరాత్మానా వీశతే దేవ ఏకః" అని ఈశ శబ్దం ద్వారా హేయ ప్రతి ఆళవందార్ నిర్వాహానికి అనుగుణంగా **"కృష్ణద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణం ప్రభుమ్, కో హ్యన్యః పుండరీకాక్షాత్ మహాభారతకృత్ భవేత్?"** (కృష్ణ ద్వైపాయను డైన వ్యాసుని ప్రభువైన నారాయణునిగా గ్రహించు. ఆ పుండరీకాక్షునికంటే అన్యుడెవరు శ్రీమహాభారతకర్త కాగలడు?) ఇత్యాది ప్రమాణాలు స్మరణీయాలు.

**52. తిరువాయ్ మొ౯ి 7-10-5- దశక ప్రవేశం – ఈడు వ్యాఖ్య.**

**(పలరడియార్మున్బు అరుళియ) "కి౯క్కుత్తై రాజాక్కళ్ పొల్లాజ్ఞాలే ఇజ్జే నలివు పిఱక్కుమళవిల్ శెయ్‌వతెన్? ఎన్ను ఎమ్బెరుమానార్ అత్తై అనుసన్ధిత్తరుళి", ఇద్దేశత్తై విడాతే నోక్కిక్కొణ్డిరున్దోమ్. ఇవ్విడత్తుక్కుమ్ అ౯ివు వరుమ్బడి ఆసురవర్గమ్ మేలిడా నిన్ఱతు. మేల్ శెయ్యపడుప్ప తెన్? ఎన్ను పెరియనమ్బిక్కు అఱివిక్క, "నాన్ పెరుమాళుడైయ ఎల్లైయిలే ఒరు ప్రదక్షిణమ్ వరుమ్బడియాక ఉమ్ముడైయ శిష్యర్కళిలే ఒరువరై పోరవిడువతు" ఎన్న, "అతుక్కావార్ ఆర్?" ఎన్న "ఎన్ పిన్నే పోకానిన్రాల్", "ఒరువన్ పిన్నే పోకానిన్ఱేన్" ఎన్ను తన్నైజ్జిల్ పడాతే ఛాయైపోలే ఎన్నై పిన్‌శెల్వాన్ ఒరువన్ ఆకవేణుమ్" ఎన్న. "అతుక్కావార్ ఆర్?" ఎన్న 'ఆ౯్వానై పోక విడలాకాతో' ఎన్రారామ్.**

**సందర్భం :– "పలర్ అడియార్ మున్బు అరుళియ పామ్బణై అప్పన్"** (భగవద్భక్తులు పలువురు ఉండగా వారికంటే ముందుగా నాకు అనుగ్రహించిన శేషశయనుడైన స్వామి) అని ఆ౯్వార్లు అనుగ్రహించారు. "వాల్మీకి, పరాశరులు, వేదవ్యాసులు, ముదలా౯్వార్లు వంటి పలువురు ఉండగా, నన్ను వెదకుతూ వచ్చి, నేను తిరువాయ్ మొ౯ి పాడేటట్లు అనుగ్రహించాడే! – అని

ఆశ్చర్యపడుతున్నారు" అని వ్యాఖ్యాత వివరిస్తూ ఈ సందర్భంలో ఒక ఐతిహ్యాన్ని ప్రస్తావిస్తున్నారు.

**వివరణం** :- శ్రీరంగానికి తూర్పు దిశను పాలించే చోళరాజుల అకృత్యాలవల్ల శ్రీరంగక్షేత్రానికి చాలా ముప్పు వాటిల్లింది. తీవ్రమైన స్వభావాన్ని కల ఒక చోళరాజు శ్రీవైష్ణవదివ్యాలయాలను పడగొట్టి, విగ్రహాలను పగులగొట్టడానికి ప్రయత్నించాడు. శ్రీరంగానికి కూడా ఏదైనా ఆపదవస్తుందో! ఏమో! అని భీతిల్లిన భగవద్రామానుజులు "మేము శ్రీరంగాన్ని ఇంతవరకు రక్షిస్తూ వచ్చాము. అయితే దీన్నికూడా నాశనం చేయాలని రాజుల సైన్యం రావచ్చునని తోస్తున్నది. ఇపుడు ఏమి చేయాలి?" అని పెరియ నంబిని అడిగారు. దానికి పెరియనంబి **"శుగ్రి నామ్ వలమ్ శెయ్య తుయర్ కెడుమ్ కడితే"** అనే రీతిలో భగవానునకు ప్రదక్షణం చేస్తే ఆపదలు తీరుతాయి. అందువల్ల నేను భగవానుని ప్రాకారంలో ప్రదక్షిణం చేయాలని అనుకుంటున్నాను. అపుడు నా వెనుక వచ్చేటట్లుగా మీ శిష్యులలో ఒకరిని మీ పంపండి" అన్నారు. "ఎవరిని పంపమన్నారు?" అని శ్రీరామానుజులు అడిగారు. "నా వెంటవచ్చేటపుడు వీరి వెనుకగా పోవలసి వచ్చిందే- అని భావించకుండా, నా నీడవలె నా వెంట వచ్చేవాడుగా అతడు ఉండాలి" అని పెరియ నంబి అన్నారు "అటువంటి వారెవరున్నారు?" అని మళ్ళీ శ్రీరామానుజులు ప్రశ్నించగా, అపుడు పెరియనంబి "కూరేశులను పంపవచ్చు కదా" అని అన్నారు. ఈ విధంగా భగవద్రామానుజుల కుండే పలువురు శిష్యుల మధ్యలో కూరేశులు ఒక్కరే ఈ అతిశయాన్ని కలవారని పెరియనంబి అనడం ఇక్కడ గమనార్హం. అందువల్ల ఇది కూరేశుల వ్యక్తిత్వవైలక్షణ్యానికి నిదర్శనం.

క్రిమికంఠుడనే చోళరాజు విష్ణుద్రోహి, అందువల్ల అతడు విష్ణు ప్రతిమలను ధ్వంసం చేయాలని అనుకొన్నాడు. అపుడు అతని ఆప్తులు "మంత్రపూర్వకంగా ప్రతిష్ఠ చేసిన విగ్రహాలకు ధ్వంసం చేస్తే నీకు మరణం కల్గుతుంది" అని అన్నారు. క్రిమికంఠుడు – "ప్రతిష్ఠ చేసిన విగ్రహాలలోని దైవశక్తికి ఉద్వాసన చేసి, వాటిని పాడుచేస్తాను" అని అనుకొని, తదనుగుణంగా "అదృశ్యాంజనాన్ని – కనపడకుండా చేసే శక్తిని కలకాటుకను పెట్టుకొని విష్ణు విగ్రహాలలోని దైవానికి ఉద్వాసనం చేయి" అని ఒకబ్రాహ్మణుని పంపాడు అతడు విష్ణు దివ్యక్షేత్రాలకుపోయి,

అదృశ్యాంజనాన్ని పెట్టుకొని, విగ్రహాలకు ఉద్వాసనం చేశాడు. అపుడు చోళరాజు వాటిని సముద్రంలో పారవేయడం ఆరంభించాడు. ఈ విషయాన్ని శ్రీరామానుజులు తెలిసికొని, బాధపడి, దానికి తగిన ప్రతిక్రియ చేయాలని భావించారు – అనే వృత్తాంతం ఈ ఐతిహ్యానికి అంగంగా స్మరణీయం.

"పలరడియార్ మున్బు అరుళియ" అనే ప్రయోగాన్ని వివరిస్తూ – వానరవీరులెంతో మంది ఉండగా శ్రీరాముడు హను మానుని ఒక్కని మాత్రం ప్రత్యేకంగా **"ప్రీత్యా చ రమమాణో౽థ రాఘవః పరవీరహా, బహుమానేన మహతా హనూమంత మవైక్షత"** అనే రీతిలో కటాక్షించడం, వేదవ్యాస మహర్షి, వాల్మీకి మహర్షి, పరాశర మహర్షి ఉండగా ఆழ్వార్లను విశేషంగా భగవానుడు కటాక్షించడం ఈడులో తెలుపబడింది. ఇటువంటి వివరణమే ఇరుపత్తి నాలాయిరప్పడిలో, పన్నీలాయిరప్పడిలో కూడా గోచరిస్తున్నది. ఆఱాయిరప్పడిలో "ఆదిశేషులు మొదలైన భక్తుల ముందు" అని వివరింపబడింది. దీనివల్ల కూరేశుల వ్యక్తిత్వ గౌరవం వీరిపట్ల శ్రీరామానుజులకు గల నమ్మకం ప్రస్ఫుట మౌతున్నది.

**(33) (7-10-11) – ఈడు**

**(నల్కి ఉరైప్పర్ తమ్ దేవియర్క్కే) ... ఉడైయవర్, తిరుక్కోట్టియూర్ నంబి తమక్కు అత్యంతగుహ్యరూక ఉపదేశిత్త చరమశ్లోకార్థత్తై త్తెఱ్కాழ్వార్ తిరుమున్బే ఎడుత్తు కైనీట్టినవార్క్కు అవర్కళ్విషయత్తిల్ ఉకప్పాలే అత్తై అరుళిచ్చెయ్దా రిఱే.**

**(నల్కి ఉరైప్పర్ తమ్ దేవియర్క్కే)** – ఉడైయవర్, తిరుక్కోట్టియూర్ నంబి తమకు చాలా రహస్యంగా ఉపదేశించిన చరమశ్లోకార్థాన్ని తెఱ్కాழ్వార్ ముంగిట గ్రహించి, చేతులు చాచి అర్థించినవారి విషయంలోని ఆనందంవల్ల దానిని తెలియజెప్పారు)

**"ఇవైపత్తుమ్ వల్లార్కళై తేవర్వైకల్ తీర్త్తజ్గళే ఎన్ఱు పూశిత్తునల్ కియురైప్పర్ తమ తేవియర్క్కే"** అని నమ్మాழ్వార్లు తాము అనుగ్రహించిన **"ఇన్బమ్ పయక్క"** అనే దశకాన్ని అభ్యసించినవారిని నిత్యసూరులు తమ దేవేరులతో "వీరు పరిశుద్ధులు" అని అభిమానించి పల్కుతారు – అని ఫలశ్రుతిని పలికారు. దీనిని వివరిస్తూ

నమ్మిళ్ళై ఈ ఐతిహ్యాన్ని పలికారు.

తిరుక్కోట్టియూర్ నంబి తమకు పరమరహస్యంగా ఉపదేశించిన చరమ శ్లోకార్థాన్ని తిరుక్కోట్టియూర్‌లో నెలకొని ఉండే భగవానుడైన తెఱ్కాழ்్వార్‌కు కైంకర్యం చేసేవారికి, వారిపట్ల ఉండే అత్యంతాభినివేశంతో, ఉడైయవర్ ఉపదేశించి నట్లు, నిత్యసూరులు పరమపదంలో భగవత్కైంకర్యం చేసేటపుడు తమకు సహాయంగా ఉండే తమ పత్నులకు ఆదరంగా ఈ దశకాన్ని అభ్యసించడంలో సమర్థులైన మహనీయులను గూర్చి వీరు సర్వకాలం తీర్థభూతులు – ఇతరులను పావనం చేసేవారు, పరమ భోగ్యభూతులు – అని ఉపదేశిస్తారు. ఈ ఐతిహ్యాన్ని బట్టి – ఈ దశక ప్రతిపాద్య వైభవాన్ని తెలిసి అభ్యసించే వారి వైభవం, చరమ శ్లోకార్థ వైభవంతో సమానమని తెలుస్తున్నది. చరమ శ్లోకార్థం పరమ గుహ్యామై" ఇదంతే నా తపస్కాయ నా భుక్తాయ కదాచన, న చా శుశ్రూషవే వాచ్యం నచమాం యోభ్య సూయతి" (ఇది తపస్వి, భక్తుడు కాని వానికి శ్రూశూష చేయనివానికి, నాపట్ల అసూయ కలవానికి చెప్పకూడదు) అనే రీతిలో యోగ్యత లేతీ వారికి ఉపదేశించ రానిది అయేటట్లే, ఈ దశకాన్ని అభ్యసించ గల్గిన పరమ పావననులైన వారి వైభవం కూడా యోగ్యత లేనివారికి ఉపదేశించ కూడదని కూడా ఈ దృష్టాంతం ద్వారా స్ఫురిస్తుంది" అని శ్రీరామానుజులను తలిచారు.

ఈ ఐతిహ్య ప్రస్తావన ఈడు వ్యాఖ్యానంలో లేదని, అరుంబదాంతరం నుండి ప్రక్షిప్తమని భగవద్విషయం శ్రీకోశంలోని అథస్సూచికలో తెలుపబడింది. దీనికి తగినట్లుగా అడైయవళైన్దాన్ అరుంబదంలో గాని, జీయర్ అరుంబదంలో గాని దీనికి చెందిన ప్రతీక కన్పించడం లేదు. ఈ ఐతిహ్యం ఈడులోని **"చరమశ్లోకమ్ రక్షిత్తు క్కొణ్డ వళవుపోలే యిరుక్కుమళవుకళిలే – ఎన్నపడి"** అనే వాక్యానికి వివరణరూపంగా ఉన్నది. శ్రీరామానుజులు చరమశ్లోకార్థాన్ని కొంతకాలం పాటు కొంతమంది శ్రీవైష్ణవులకు ఉపదేశించకుండా ఉన్నా, తెఱ్కాழ்్వార్ కైంకర్యం చేసిన తరువాత అందటికి ఉపదేశించారని, ద్రౌపది కేశాలు విరగబోసి కొని ఉండడం చూడలేక శ్రీకృష్ణుడు, అతిరహస్యంగా కాపాడుతూ ఉండే చరమశ్లోకాన్ని అర్జునునకు ఉపదేశించాడని అరుంబదాలలో ఈ వాక్యవివరణం కన్పిస్తున్నది. ఈ విధంగా అతిగుహ్యామైన చరమశ్లోకాన్ని, దాని అర్థాన్ని భక్తవ్యామోహంతో వ్యక్తం చేసిన ఇద్దఱు రామానుజులే కావడం విశేషం.

## (34) (8-7-3) ఇరుపత్తు నాలాయిరప్పడి

**(ఇదువల్లాల్ పొరుళ్‌తానెనిల్ మూవులకుమ్ పొరుళల్ల) "నాట్టార్ ఐశ్వర్య జ్ఞళిల్ తలైయాక నినైత్తిరుప్పదు త్రైలోక్య ఐశ్వర్యత్తై ఆయిఱ్ఱు. ఇవన్ ఎన్ హృదయత్తి లే పుకున్ద పిన్బు అత్తైయుమ్ ఒరు పొరుళాక నినైత్తిలేన్, ఎన్ఱు ఆళవందార్ నిర్వాహమాక త్తిరుమాలై యాణ్డాన్ పణిక్కుమ్. "ఎన్ హృదయత్తిలే వీఱ్ఱిరున్ద ఇదొழியే "వీఱ్ఱిరున్దేழులకమ్ తనిక్కోల్ శెల్ల" ఇరుక్కిఱ ఐశ్వర్యత్తైయుమ్ ఒరు పురుషార్థమాక నినైత్తిరుక్కుమో! ఎన్ఱు పార్‌త్తాల్, అదువుమ్ అవనుక్కు ఒరు శరక్కల్ల" ఎన్ఱు ఎమ్బెరుమానార్ నిర్వాహమ్.**

**(ఇదు వల్లాల్ పొరుళ్ తానెనిల్ మూవులకుమ్ పొరుళల్ల)** "లోకంలోని వారు ఐశ్వర్యాలలో గొప్పగా భావించేది. త్రైలోక్యైశ్వర్యాన్ని, ఇతడు నా హృదయంలో ప్రవేశించిన తరువాత, ఆ ఐశ్వర్యాన్ని కూడా ఒక వస్తువుగా భావించను" అని ఆழ్వార్లు అంటున్నారని ఆళవందార్ నిర్వాహమని తిరుమాలై యాణ్డాన్ అన్నారు. "నా హృదయంలో వేంచేసి ఉండడమనే విషయం తప్ప, "సింహాసనంపై వేంచేసి ఉండి, ఏడు లోకాలను అద్వితీయ ఆజ్ఞా దండం చెల్లగా పాలించ"డమనే ఐశ్వర్యాన్ని కూడా ఒక పురుషార్థంగా భగవంతుడు భావిస్తాడా! అని గమనించి చూస్తే, అదికూడా అతనికి ఒక విషయం కాదు" - అని ఆழ్వార్లు పల్కుతున్నారని శ్రీరామానుజుల నిర్వాహం)

**"అవన్ ఎన్నుళ్ ఇరుళ్ తానఱ వీఱ్ఱిరున్దాన్ ఇదువల్లాల్ పొరుళ్ తానెనిల్ మూవులకుమ్ పొరుళల్ల"** (అతడు నాలో తమస్సు తొలిగేటట్లు వేంచేసి ఉన్నాడు. ఇది కాదు పురుషార్థం అంటే, ఇక, ముల్లోకాలు కూడా పురుషార్థం కాదు) అని ఆழ్వార్లు పల్కిన సూక్తిని వివరిస్తూ నమ్బిళ్ళై, ఈడు వ్యాఖ్యలో ఆళవందార్, ఎమ్బెరుమానార్ పల్కిన నిర్వాహాలను ప్రస్తుతించారు.

లోకంలో ఉండేవారంతా చాలా గొప్ప ఐశ్వర్యంగా భావించేది ఏమి? అంటే - ముల్లోకాలను ఏలే ఐశ్వర్యమే. భగవానుడు నా మనస్సులో ప్రవేశించిన తరువాత త్రైలోక్యశ్వర్యాన్ని నేను ఒక పదార్థంగా భావించనని ఆழ్వార్లు పల్కుతున్నారనేది ఆళవందార్ నిర్వాహం. "మాయక్కూత్తా" అనే దశకంలో నేను పొందిన ఆర్తి

తీరేటట్లు నాతో సంశ్లేషించిన సర్వేశ్వరుని దర్శించి ఆనందించడం కంటే ముల్లోకాల లోని ఐశ్వర్యం కూడా విషయం కాదు – అని ఈ నిర్వాహ సారం.

భగవంతుడు తమకు **"మయర్వఱ మదినలమ్"** ( భ్రాంతి, అజ్ఞానాదులు లేని భక్తిరూపాపన్నజ్ఞానాన్ని) అనుగ్రహించిన తరువాత ముల్లోకాలను పాలించే ఐశ్వర్యాన్ని సైతం ఆ*ళ్వా*ర్లు ఒక వస్తువుగా భావించరు, కనుక – "నా మనస్సులో ప్రవేశించిన తరువాత, అధికారసింహాసనాన్ని అధిష్ఠించి, ఏడు లోకాలలో ఎదురులేని ఆజ్ఞాదండం చెల్లేటట్లు పాలించే ఐశ్వర్యాన్నికూడా భగవంతుడు ఒక వస్తువుగా గణిస్తాడా? అని చూస్తే, నా హృదయంలో వేంచేసి ఉండడం కంటే, ఏడులో కాల ఐశ్వర్యాన్ని అతడు ఒక పదార్థంగా లెక్కపెట్టడు – అని ఆ*ళ్వా*ర్లు పల్కుతున్నారని శ్రీరామానుజుల నిర్వాహం.

ఈ రామానుజుల అర్థ నిర్వాహం ఈ దశకంలోని ప్రకరణానికి అనుగుణం. ఈ దశకానికి ప్రవేశాన్ని అనుగ్రహించే నమ్బిళ్ళై – "ఇతుతాన్ ఇవర్క్కు ఉపకరిత్తా నాకైయన్ఱిక్కే తన్ పేఱా యిరుక్కిఱ పడియై అనుసంధిత్తు, "తానే అర్థియాయ్ తన్ పేఱాక వన్దు కులన్దవనై" (భగవంతుడు ఆళ్వార్లకు ఉపకారం చేస్తునట్లుగా కాకుండా, అది తనకు లాభంగా భావించిన రీతిని అనుసంధించి, తానే అర్థించేవాడై, తన లాభంగా వచ్చి సంశ్లేషించిన వానిని) అని పల్కడం స్మరణీయం. ఈ విధంగా పల్కడం కూడా ఈ దశకంలోని "ఇరున్దాన్ కణ్డుకొణ్డు" ఇత్యాది ప్రయోగాలు మూలం నంబిళ్ళై వీనిని (ఇరున్దాన్ కణ్డుకొణ్డు) – దరిద్రన్, ధనలాభ ముణ్డానాల్ పార్త్తుక్కొణ్డిరుక్కు మాప్పోలే పార్త్త పడియే యిరా నిన్ఱాన్" (దరిద్రుడు, ధన లాభం కల్గితే ఆనందంగా దానివైపే చూస్తూ ఉండేటట్లు) అని వ్యాఖ్యానించడం, దీనికి ప్రమాణంగా "తతః సుప్రీత మనసౌతావు భౌ కపిరాఘవౌ, అన్యోన్య మభి వీక్షంతౌన తృప్తి ముపజగ్మతుః" (అపుడు ఆనందించిన మనస్సును కల ఆ సుగ్రీవుడు, శ్రీరాముడు ఇద్దఱు ఒకరినొకరు చూచుకొంటూ తృప్తిని పొందలేదు) అనే శ్రీరామాయణ శ్లోకాన్ని ఉదాహరించడం, మొదటి పాశురం చివరలో గల "నా ()రున్దాన్" (వేంచేసి ఉన్నాడు) అనే ప్రయాగాన్ని "ఇవరై ప్పె() ఇవత్తాలుణ్డాన వేఱుపాడు వడి విలేతో () కృతకృత్యనా యిరానిన్దాన్" (వీరిని పొందినందువల్ల

కల్గిన వైలక్షణ్యం అంటే – ఆనందం – తన రూపంలో ప్రకాశించేటట్లు కృతకృత్యుడై ఉన్నాడు) అని వివరించడం, పెరియవాచ్చాన్ పిళ్ళై కూడా "కణ్డుకొణ్డే" అనే ఈ పదాన్ని వ్యాఖ్యానిస్తూ శ్రీరామాయణంలోని "అభిషిచ్యచలం కాయాం రాక్షసేంద్రం విభీషణమ్, కృత కృత్యస్తదా రామోలిజ్వరః ప్రముమోదహా" (రాక్షస ప్రభువైన విభీషణుని లంకకు ప్రభువుగా అభిషేకించిన తరువాత శ్రీరాముడు కృతకృత్యుడై, మనస్సులో క్లేశాన్ని తీరినవాడై చాలా ఆనందాన్ని పొందాడు) అనే శ్లోకాన్ని ప్రమాణీకరించడం వంటి పలువిశేషాలు గమనార్హాలు. ఇందువల్ల శ్రీరామానుజ నిర్వాహం ఉభయ వేదాంత సమన్వయ రూపమైనది.

"ఇతుపల్లాల్, మూవులకుమ్ పొరుళ్ తానెనిల్ పొరుళల్ల" అనేది ఇక్కడ అన్వయం ఈ స్థితి తప్ప, త్రైలోక్యశ్వర్యం కూడా పురుషార్థం అంటే, పురుషార్థం కాదు – అని దీనిభావం. ఇక్కడ ఎవరికి పురుషార్థం? – అనేది పాశురంలో స్పష్టంగా లేదు.

భగవత్ప్రాధాన్యపరంగా ఆళవందార్ నిర్వాహం, ఆ*ழ*్వార్ల ప్రాధాన్యపరంగా శ్రీరామానుజనిర్వాహం. ఈడులోకూడా ఈ ఐతిహ్యాల ప్రస్తావన ఉన్నది. శ్రీరామానుజుల నిర్వాహం **"చేతనలాభం ఈశ్వరునికే"** అనే సిద్ధాంతానికి అనుగుణం. అంతేకాక **"తయరఱుశుదరడి"** అనే మొట్టమొదటి పాశురంలో శ్రీరామానుజులు చేసిన నిర్వాహానికి **"అదనిల్ పెరియనన్ అవా అఱ చ్చూ*ழ*్న్దాయ్"** – (తత్త్వ త్రయాన్ని కబళీకరించే రీతిలో పెద్దదైన నా ఆర్తి కూడా గోష్పాదమనేరీతిలో ఇంకా గొప్ప ఆర్తిని కలవాడవై, నన్ను సంశ్లేషించి నా ఆర్తిని తీర్చావు) – అనే ప్రబంధంలోని చివరిసూక్తికి కూడా అనుగుణం. **"అంకే భరత మారోప్యముదితః"** అని శ్రీరామాయణంలో కూడా చేతన లాభం వల్ల ఆనందాన్ని పొందేవాడు సర్వేశ్వరుడే అని తెలుపబడింది కదా. ఆఱాయిరప్పడి, ఒన్బదినాయిరప్పడి, పన్నీరాయిరప్పడి వ్యాఖ్యలలో శ్రీరామానుజ నిర్వాహానుసారంగ వివరింప బడింది.

**(35) (8-9-3) ఇరుపత్తునాలాయిరప్పడి**

**( పుక*ழ*ుమ్ పొరుపడై శె*ழ*ుమ్ కదిరా*ழ*ి ముదల్ ఏన్ది ) – "హేతిభి శ్చేతనావద్భి రుదీరతజయస్వనమ్" ఎన్గిఱపడియే దివ్యాయుధఙ్గళ్ అవనై పుక*ழ*ా**

**నిఱ్కుమ్ – ఎన్ఱు ఆళవన్దార్ నిర్వాహమ్. "శత్రోః ప్రఖ్యాతవీర్యస్య రంజనీయస్య విక్రమైః" ఎన్గిఱ పడియే "కైయుమ్, ఆయుధప్పొరుత్తముమ్ యిరున్దపడి యెన్?" ఎన్ఱు శత్రుక్కళ్ పుక*ழు*మ్బడియై చ్చొల్లుకిఱదు – ఎన్ఱు ఎమ్బెరుమానార్ అరుళిచ్చెయ్వర్".**

**"శె*ழு*మ్ కదిరా*ழి* ముదల్ పుక*ழు*మ్ పొరుపడై ఏన్ది"** (దట్టమైన కిరణాలను కల సుదర్శనం మొదలైన, యుద్ధోన్ముఖాలైన ఆయుధాలను ధరించి) అని ఆ*ழ*్వార్లు పల్కిన సూక్తిని వ్యాఖ్యానిస్తూ పెరియవాచ్చాన్ పిళ్ళై ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యలో ఆళవందార్, ఎమ్బెరుమానార్ల అర్థనిర్వాహాల ప్రస్తావనను చేశారు. ఇక్కడ ఎవరు కీర్తిస్తున్నారు? అనేది స్పష్టంగా లేనందున, **"దైత్య స్త్రీ గండరేఖాణాం మదరాగవిలో కిభిః, హేతిభిశ్చేతనావద్భిరుదీరిత జయస్వనమ్"** (అసుర స్త్రీల గండస్థలాలలో లిఖించబడిన పత్రలేఖలను లేకుండా చేసేవి, చైతన్యాన్ని కల్గినవి అయిన దివ్యాయుధాలచే మంగళాశాసనం చేయబడేవాడు) అని రఘువంశంలో పల్కినట్లు, **"పుక*ழு*మ్ పొరుపడై"** అనే ప్రయోగానికి కీర్తించే, యుద్ధోన్ముఖాలైన చక్రాది ఆయుధాలని అర్థం – అని ఆళవందార్ నిర్వాహం చేశారు. ఈ అర్థం ఈడు వ్యాఖ్యానంలో కూడా ప్రస్తావింపబడినా, ఆళవందార్ ప్రోక్తంగా తెలుప బడలేదు.

**"శత్రోః ప్రఖ్యాతవీర్యస్య రంజనీయస్య విక్రమైః"** (శత్రువుల వద్ద కూడా ప్రసిద్ధమైన వీర్యాన్ని కలవాడు, తన పరాక్రమాలతో శత్రువులు తనను పొగిడేటట్లు చేసేవాడు) (రామా – యుద్ధ – 106 – 6) అని వాల్మీకి పల్కినట్లు **"పుక*ழு*మ్ పొరుపడై"** – అంటే – "శ్రీహస్తంలోని ఆయుధాలు పొసగి ఉండే అందం, ఆహా! ఎంత గొప్పది!" అని శత్రువులు సైతం పొగడేటట్లు ఆయుధాలను ధరించి – అని శ్రీరామానుజులను గ్రహించారు. **"శత్రోః ప్రఖ్యాతవీర్యస్య"** ఇత్యాది సూక్తి రావణుడు తన సారథితో శ్రీరాముని ప్రశంసిస్తూ పల్కినది. ఈ అర్థాన్ని శ్రీరామానుజులు పల్కినట్లు ఈడులో తెలుపబడింది. **"పుక*ழு*మ్ పొరుపడై ఏన్ది పోఱ్కు అశురరై పొన్ఱువిత్తాన్"** అనే ఈ ప్రయోగంలో ఆళవందార్ నిర్వాహానుసారం **"పుక*ழு*మ్"** అనే పదం **"పడై"** అనే పదాలతో అన్వయించి అర్థం చెప్పబడింది – శ్రీరామానుజుల

నిర్వాహంలో **"అశురరై"** అనే పదంతో అన్వయించి అర్థం చెప్పబడింది – అని చెప్పవచ్చు. **"పుకఌుమ్"** అనే పదానికి ఇది దూరాన్వయమనుకుంటే, శత్రువులు– అనే అర్థం వచ్చే పదాన్ని ఆక్షిప్తం చేసికోవాలి. **"విక్రమైః శత్రోః రంజనీయస్య"** – తన పరాక్రమాలతో శత్రవులకు రంజకుడు – అని శ్రీరామాయణ ప్రమాణానికి శ్రీరామానుజుల నిర్వాహంలో అన్వయం. పన్నిరాయిరప్పడిలో, ఒన్బదినా యిరప్పడిలో శ్రీరామానుజ నిర్వాహపరంగా అర్థం చెప్పబడింది. ఇక్కడ కర్తరి "అనీయర్" ప్రత్యయం వచ్చి "రంజనీయస్య" అనేరూపం ఏర్పడింది.

## (36) 9–2–4 – ఈడు

**(పుళిఙ్గుడి – యిత్యాది) "భట్టర్ తిరునారాయణపురత్తిల్ వెఌుప్పిలే. "దేవర్ స్వాతంత్ర్యమ్ కాట్టినాలుమ్ పిన్నైయుమ్ పణ్ణిన విశ్వాసత్తిల్ కులైతల్ ఇన్ఱిక్కే ఇరుక్కు మ్బడి ఎలుమ్బు ఉరముడైయ ఎమ్బెరుమానార్‌పోల్‌వార్ పక్కల్ శెయ్యుమత్తై ఎలి ఎలుమ్బునాన అడియేన్‌పక్కలిలుమ్ శెయ్‌వదో! "మహావిశ్వాసపూర్వకమ్" ఎన్గిఱ పడియే ఏదేనుమ్ ఒన్ఱు వన్దాలుమ్, "ఇఙ్గుత్తైక్కు ఒన్ఱు వరువదాయ్ వన్దదు అన్ఱు, అదుక్కు అడి నమ్ముడైయ పాపమ్" ఎన్ఱు పణ్ణిన విశ్వాసమ్ కులైయాదార్ విషయత్తిలే ఇళనెఞ్జర్ పక్కలిలుమ్ అత్తై చ్చెయ్యక్కడవదో! – ఎన్ఱారామ్"**

తిరువాయ్ మొఴిలో **"తెళిన్ద ఎన్ శిన్దై అకమ్ కఴియాదే ఎన్నై యాళ్వాయ్"** (తేటపడిన నా మనస్సు లోపల విడువకుండా ఉండి నన్ను పాలించేవాడా!) అని నమ్మాఴ్వార్ పలికారు. ఇక్కడ **"తెళిన్ద ఎన్ శిన్దై"** అనే ప్రయోగానికి "ఎన్ని క్లేశాలు కల్గినా కలత చెందని మనస్సు" అనే అర్థాన్ని పల్కిన వ్యాఖ్యాత ఇక్కడ ఒక ఐతిహ్య ప్రస్తావనం చేశారు.

పిళ్ళై తిరునఱైయూర్ అరైయర్ అనే ఆచార్యులు భట్టర్ కంటే వయస్సులో చాలా పెద్దవారు. భట్టర్ అభిమానానికి, గౌరవానికి పాత్రమైనవారు. వారు **"తొట్టియమ్ తిరునాయణపురమ్"** అనేచోట యవనుల దాడి వల్ల కల్గిన ఉపద్రవం నుండి భగవదర్చామూర్తిని కాపాడడంకోసం తమ కుటుంబంతోపాటు ప్రాణ త్యాగాన్ని చేశారు. దీని వివరం పెరుమాళ్ తిరుమొఴి (5–3) పాశుర వ్యాఖ్యలో, శ్రీవచన భూషణగ్రంథంలో, వ్యాఖ్యలో గమనించవచ్చు. వీరి ప్రాణత్యాగ

విషయాన్ని తెలిసికొన్న భట్టర్ "భగవంతుడా! నీ స్వాతంత్ర్యాన్ని అంతటినీ చూసినా నీపట్ల కల్గి ఉండే విశ్వాసంతో కొంచెం కూడా సడలని మనోదార్ఢ్యాన్ని కల శ్రీరామానుజుల వంటివారిపట్ల చేయదగినవానిని, అత్యంతం బలహీనుడైన నా విషయంలో చేయవచ్చునా?" అని అన్నారు. (చోళరాజు సభలో తమ శిష్యుడైన కూరేశుల నేత్రాలను, తమ ఆచార్యులైన పెరియనంబి ప్రాణాలను కోల్పోయిన విషయాన్ని విని, భరించి తట్టుకొన్న శ్రీరామానుజులను మనస్సులో పెట్టుకొని భట్టర్ ఈ విధంగా అన్నారు) భగవానుని ఆశ్రయించేటపుడు "మహావిశ్వాస పూర్వకంగా" (అతడు మనలను తప్పక రక్షిస్తాడనే దృఢవిశ్వాసంతో) ఆశ్రయించాలని శాస్త్రాలలో చెప్పబడి నందున, ఏదయినా క్లేశం కల్గినా, "ఇది మనలకు బాధించడం కోసం భగవానుడు పెట్టే క్లేశం కాదు, మనం చేసిన పాపాలే మనలను ఈ విధంగా బాధిస్తున్నాయి" – అనే భావంతో భగవంతునిపై పెట్టుకొన్న విశ్వాసంతో కొంచెంకూడా సడల నీయకుండా ఉండేవారిపట్ల చేయదగినవానిని, ఇదే కారణంగా మనస్సు చెదరి పోయేటట్లు ఉండే బలహీనుడనైన నావంటివారి విషయంలో చేయవచ్చునా? అరైయర్‌కు ఏర్పడిన ఆపదను నీవు అడ్డకోకుండా, నీవే రక్షకుడవనే నమ్మికను పోగొట్టేటట్లు చేయదగునా? – అని అన్నారట.

ఈ నిర్వాహాలు ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యలో కూడా ప్రస్తావించ బడ్డాయి. పిళ్ళైత్తిరునఱైయూర్ అరైయర్‌కు సంబంధించిన ప్రస్తావనలు దివ్యప్రబంధ వ్యాఖ్యలలో కనీసం 36 చోట్ల కన్పిస్తాయి. ఉదాహరణకు – పెరియాళ్వార్ తిరుమొఴి (3–3–6) తిరువాయ్‌మొఴిప్పిళ్ళై వ్యాఖ్య, (4–9–3) మణవాళ మహామునివ్యాఖ్య, తిరుప్పావై 12వ పాశురం నాలాయిరప్పడి వ్యాఖ్య, పెరియతిరుమొఴి (11–8–1) పాశుర వ్యాఖ్యలో వీరి ప్రస్తావనను చూడవచ్చు.

**(37) (9–4–3) – ఈడు**

**(పిఴైక్కిన్డదు అరుళ్ ఎన్ను పేదుఱువనే) – వరైయాదే రక్షిత్త మహాగుణమ్ ఎనక్కు ఉదవామైయాలే ఇఴక్కప్పుకానిన్డాయ్ – ఎన్ను పేకణియానిన్డేన్. – ఎన్ను ఆళవందార్ అరుళిచ్చెయ్యుమ్బడి. అత్తై ఎమ్బెరుమానార్ కేట్టరుళి, "ఇదు పొరుళ్ అఴకిదు, ఆనాల్, ఇప్పోదు ఇవర్క్కు ఓడుకిఱ దశైక్కు శేరాదు. ఆనపిన్బు, పశుక్కళుమ్, ఇడైయరుమ్ వర్షత్తిలే నోవు పడాదపడి మలైయై ఎడుత్తు మఱిత్త**

**ఇమ్మహాగుణత్తుక్కు నాన్ పుఱమ్ పోకిత్తేనో! ఎన్ను పేకణియానిన్నేన్"** – ఎన్ను

**"మఱ్ఱైక్కు అన్ను కున్ఱమ్ ఎడుత్తు ఆనిరై కాత్తాయ్! పిఱ్ఱైక్కిన్దదు అరుళెన్ను పేదుఱువనే!"** (ఆనాడు శిలావర్ష నుండి రక్షించడంకోసం పర్వతాన్ని ఎత్తి, గొడుగుగా పట్టి గోగోపీగోసంఘాన్ని రక్షించినవాడా! నీ కృప తప్పుతున్నది – అని నా హృదయం క్లేశపడుతున్నది) అని పల్కిన ఆళ్వార్ల సూక్తిని వ్యాఖ్యానిస్తూ నమ్బిళ్ళై ఆళవందార్, శ్రీరామానుజుల అర్థనిర్వాహాలను ప్రస్తావించారు.

ఆ నాడు పశువును రక్షించిన నీవిపుడు నన్ను కాపాడకుండా ఉన్నావు. అందువల్ల, "అందఱిని రక్షించేవాడవు" అనే ఆ మహాగుణాన్ని ఈనాడు నీవు కోల్పోవలసి వస్తున్నదే – అని నేను క్లేశపడుతున్నాను – అని ఆళ్వార్లు పల్కు తున్నట్లు ఆళవందార్ నిర్వాహం.

ఈ అర్థాన్ని శ్రీరామానుజులు విని "ఈ అర్థం బాగున్నది. అయినా, భగవానుని కృప తమకు లభించనందున క్లేశంతో పలికే ఆళ్వార్ల ప్రకృతస్థితికి ఈ అర్థం పొసగదు. అందుచేత "పశువులు, గోపాలుడు వర్షంవల్ల బాధపడకుండా రక్షించిన ఈ మహాగుణానికి నేను బాహ్యుడను అవుతున్నానే! లక్ష్యవస్తువు కాకుండా పోతున్నానే! – అని బాధపడుతున్నాను – అని ఆళ్వార్ పల్కుతున్నట్లు తెలిపారు.

"నీ కృప నిన్ను తప్పిపోతున్నదే! – అని బాధపడుతున్నాను" – అని ఆళ్వార్లు అంటున్నారని ఆళవందార్ నిర్వాహం. "ఆ కృప నన్ను తప్పిపోతున్నదే!" అని క్లేశ పడుతున్నాను – అని ఆళ్వార్లు పల్కుతున్నారని శ్రీరామానుజనిర్వాహం. **"పిఱ్ఱైక్కిన్దదు"** – తప్పిపోతున్నది – అనే క్రియ "ఎవరి విషయంలో అనేది పాశురంలో స్పష్టంగా లేదు. అందువల్ల శ్రీరామానుజుల నిర్వాహంలో ఆళ్వార్ల విషయంగా అన్వయింప బడింది. ఇది ప్రకృత దశక ప్రకరణానుగుణం. **"ఉన్నై క్కాణ క్కరుదుమ్ ఎన్కణ్ణే" "ఎన్కరుత్తే", "ఉన్నైయాళ్ళుమ్ ఎన్నుళ్ళమ్"** అని తమ ఇంద్రియాలు, తాము ఆర్తిని పొందారు కదా! అని ప్రకృతంలో ఆళ్వార్లు భగవదనుభవంకోసం పరితపిస్తున్నారు కదా! ఆళవందార్ నిర్వాహం ప్రకృత పాశురంలోని **"మఱ్ఱైక్కు అన్ను కున్ఱమెడుత్తు అవిరైకాత్తాయ్"** అనే ప్రయోగానికి అనుగుణం. ఇరుపత్తు నాలాయిరప్పడిలో కూడా ఈ రెండు నిర్వాహాలు నామోట్టంకన పురస్సరంగా తెలుప

బడ్డాయి. ఆఱాయిరప్పడి, ఒన్బదినాయిరప్పడి, పన్నీరాయిరప్పడి వ్యాఖ్యలలో శ్రీరామానుజుల నామం ఉట్టంకింపబడక పోయినా, వారి నిర్వాహానుగుణంగానే వివరింపబడింది.

**(38) (9–5–10) – ఈడు**

**(తళ్ళై నల్ల – ఇత్యాది) – తామ్ తామ్ ముడియ నినైప్పార్ "నాడు వాళ్ క" ఎన్బారైప్పోలే శొల్లుకిఱాళ్ – ఎన్ఱు ఆళవన్దార్ నిర్వాహమ్. "నాన్ పట్టపాడు పాడు పడాదొళ్ళియవేణుమ్" ఎన్ఱు ఎమ్బెరుమానార్. "నాన్ ముడియ, ఎన్ ఆర్తి కణ్డు నోవు పడాదే లోకమ్ అడఙ్గ పిళ్ళైక్కుమాకాదే" – ఎన్ఱు భట్టర్.**

భగవద్విరహక్లేశంతో నాయకీదశను పొందిన ఆళ్వార్, తమ ఆర్తిని పోగొట్టుకోవడంకోసం పూలతోటకు వెళ్ళింది. అక్కడ కోయిల, నెమలి మొదలైన పక్షులుకూడా భగవానునే స్మరింపజేసి, ఆమె (నాయకి) బాధను ఇంకా ఇంకా అధికం చేశాయి. చివరకు ఆమెకు క్లేశాతిశయంతో ప్రాణాలు పోయే దశలో ఏర్పడింది. అపుడు నాయకి, పక్షులను చూచి **"ఇళ్ళ నల్ల ఆక్కైయుమ్ పైయవే పుయక్కఱ్ఱుతు, తళ్ళనల్ల ఇన్బమ్ తలైప్పెయ్దు ఎఙ్గుమ్ తళ్ళైక్కవే"** (ఆభరణాలను ధరించిన నామేని లావణ్యాన్ని కోల్పోయింది. లోకమంతా ఆనందాన్ని పొంది సుఖంగా జీవించుగాక!) అని పల్కుతున్నట్లుగా ప్రకృతపాశురం ఉన్నది. తన ప్రాణం పోయే దశలో "లోక ఆనందంగా జీవించాలి" పల్కిన మాటలోని తాత్పర్యమేమి? అనేదానినిగూర్చి వ్యాఖ్యాత నమ్బిళ్ళై ముగ్గురు మహాచార్యుల నిర్వాహాలను ప్రస్తావించారు.

లోకంలోవారు తమ ప్రాణాలను విడిచేటపుడు "నేను చనిపోయినా లోకం సుఖంగా ఉండాలి" అని పల్కి ప్రాణాలు విడిచేటట్లే పరాంకుశనాయకి కూడా లోకం సుఖంగా జీవించాలి – అని అంటున్నదని ఆళవందార్ నిర్వాహం.

నేనే భగవంతునిపట్ల అభినివేశాన్ని పొంది పడరాని క్లేశాన్ని పడి, ప్రాణం పోయే దశకు దుఃఖాన్ని అనుభవించాను. లోకంలో ఉండేవారు నావలె భగవంతుని పట్ల అభినివేశాన్ని పొంది బాధపడకుండా, సుఖంగా జీవించాలి – అని నాయకి అంటున్నదని శ్రీరామానుజుల నిర్వాహం.

ఇంతవరకు నేను పడిన పాట్లను అన్నిటినీ చూచి లోకం అంతా దుఃఖంలో మునిగి ఉన్నది. ఇక నేను ప్రాణాలు విడువబోతున్నాను. ఇకపై, నేను పడే వేదనలను చూచి బాధపడనక్కఱ లేకుండా లోకం బతికిబయటపడింది కదా! అందువల్లనే లోకం ఇక సుఖంగా జీవించనీ – అని నాయకి పల్కుతున్నదని భట్టర్ నిర్వాహం.

ఆళవందార్ నిర్వాహం లోకసామాన్య రీతిలో చేయబడగా, ఎమ్బెరుమానార్ నిర్వాహం ప్రకృత సందర్భానికి అనుగుణంగా చేయబడింది. భట్టర్ నిర్వాహంలో భగవద్విషయంలో గర్హణ స్ఫురిస్తున్నది. **"భట్టర్ నిర్వాహమ్ – వెఱుప్పిలే"** అని అరుంబదం.

ఈ నిర్వాహాలు ఇరుపత్తునాలాయిరప్పడిలో కూడా ప్రస్తావించబడ్డాయి. భట్టర్ నిర్వాహం భగవానుని గర్హించి పలికే అర్థంలో చేయబడింది. ఆఱాయిరప్పడిలో కూడా **"నాన్‌పట్టపాడు ఒరువరుమ్ పడాదొ( )న్దిడుక"** (నేను పడినపాట్లు ఎవరూ పడకుండా ఉండాలి) అని శ్రీరామానుజ నిర్వాహసారంగా వివరింపబడింది. ఒన్బది నాయిరప్పడిలో మూడు నిర్వాహాల ప్రస్తావన ఉన్నా పేర్లు ఉట్టంకింపబడలేదు. **"పన్నీరాయిరప్పడిలో నిర్వాహానుసారంగా ఇని ఎన్‌దుఃఖమ్ కాణామైయాలే ఎల్లా దేశముమ్, విస్తీర్ణమాయ్ నన్ఱాన సుఖత్తైప్పె( ) సమృద్ధమాకకక్కడవదు"** (ఇక నా దుఃఖం చూడనందున అన్ని దేశాలు విస్తరించి, చక్కగా సుఖాన్ని పొంది వృద్ధిని పొందాలి అని వ్యాఖ్యానింప బడింది.

### (39) (9-7-5) ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్య

**(తెళివిశుమ్బు – ఇత్యాది) – పరమపదమ్ దేశమా యిరుక్క, అత్తై కాఱ్కదై క్కొణ్డు, ఎన్ నెఞ్జిలే నిత్యవాసమ్ పణ్ణుకిఱవన్ – "ఎన్ఱు శిఱ్ఱాట్కొణ్డాన్ పణిక్కుమ్. "పరమపదత్తిలే పణ్ణుమ్ వ్యామోహత్తై ఎన్ నెఞ్జిలే పణ్ణి వర్త్తియా నిన్ఱాన్" – ఎన్ఱు ఎమ్బెరుమానార్.**

**"తెళివిశుమ్బు తిరునాడా త్తీ వినైయేన్ మనత్తుఱైయుమ్"** (తేటపడిన – స్వచ్ఛమైన ఆకాశమని చెప్పబడే పరమపదంగా పాపిష్ఠివాడనైన నా మనస్సును గ్రహించి, భగవానుడు వేంచేసి ఉన్నారు – అని ఆழ్వార్లు పల్కుతున్నారు. ఈ సూక్తిని వివరిస్తూ ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యలో పెరియవాచ్చాన్ పిళ్ళై రెండు

అర్థ నిర్వాహాలను చూపారు.

"ఉన్నతస్థానమైన పరమపదం ఉండగా, దానిని కాదని, స్వామి నా మనస్సులో నిరంతరంగా వసిస్తున్నాడు'' - అని ఆళ్వార్లు పల్కుతున్నట్లు - శిఱ్ఱాట్కొణ్డాన్ అనే ఆచార్యులు తెలిపారు.

చాలా ఉన్నతమైన పరమపదంపట్ల తాను కల్గి ఉండే ప్రేమ, అదరం అంతా నా మనస్సుపట్ల కల్గి ఉన్నాడు – అని ఆళ్వార్లు పల్కుతున్నారని శ్రీరామానుజుల నిర్వాహం. (ఈడులో వ్యాఖ్య కూడా ఈ నిర్వాహం చూపబడినా, ఆ రామానుజులు పల్కినట్లు అందులో చెప్పబడలేదు)

ఇది భగవంతునివద్దకు ఆళ్వార్లు పక్షుల ద్వారా దౌత్యాన్ని పంపే సందర్భం కనుక, మనస్సులోనే వేంచేసి ఉండేవాడు – భగవంతుడు అని భావించడం, అతని దగ్గరకు దౌత్యాన్ని పంపే ఈ దశకార్థానికి పొసగదు – అని తలచి శ్రీరామానుజులు ఈ అర్థాన్ని చెప్పి ఉండవచ్చు.

**శిఱ్ఱాట్కొణ్డాన్ నిర్వాహంలో "తెళివిశుమ్బు తిరునాడా"** అనే ప్రయోగానికి పరమపదం వాపస్థానమై ఉండగా – అని, శ్రీరామానుజుల నిర్వాహంలో– పరమ పదమనే వాసస్థానం అయేటట్లుగా – అని అర్థం. ఈడు, ఒన్బదినాయిరప్పడి, ఆఱాయిరప్పడి వ్యాఖ్యలలో శ్రీరామానుజ నిర్వాహానుగుణంగా వివరణం కన్పిస్తున్నది.

శిఱ్ఱాట్కొణ్డాన్ చేసిన నిర్వాహాలు పలుచోట్ల కన్పిస్తాయి.

**(40) (9–8–1) – ఈడు**

**(కుఱుక్కుమ్ వకై ఉణ్డుకొలో!) ఎమ్బెరుమానార్ తిరువడితొழுఎழுన్దరుళా నిఱ్క, "తిరునావాయ్ ఎత్తనై యిడమ్ పోరుమ్" ఎన్ను ఎదిరే వరుకిఱార్ శిలరై క్కేట్టరుళ, "కుఱుక్కుమ్" ఎన్నార్కళాయ్, అత్తై క్కేట్టు, "ఇబ్బాషైయాలే అరుళిచ్చెయ్వ దే, ఆళ్వార్!" ఎన్ను పోర విద్ధరాయరుళినార్.**

**"తిరునావాయ్ కుఱుక్కుమ్ వకై యుణ్డుకొలో కొడియేత్కే?"** (తిరునావాయ్ దివ్యదేశాన్ని పాపిష్ఠివాడనైన నాకు దరి చేరే రీతి ఉన్నదా? అని ఆళ్వార్లు పల్కిన సూక్తిని నమ్బిళ్ళై వ్యాఖ్యానిస్తూ ఈ అద్భుతమైన ఐతిహ్యాన్ని ఈడులో ప్రస్తావించారు.

ఇక్కడ ఆ*ళ్వా*ర్లు **"కుఱుకుమ్ వకై ఉణ్డుకొలో"** అని అనవలసి ఉండగా, ఆ విధంగా అనకుండా, **"కుఱుక్కుమ్ వకై యుణ్డుకొలో!"** అని పల్కిన ప్రయోగాన్నిగూర్చి శ్రీరామానుజులు పల్కిన సూక్తి ఇది. **"కుఱుకుదల్"** అంటే – దగ్గరలో ఉండడం.

శ్రీరామానుజులు ఒక పర్యాయం మళైయాళ దివ్యదేశ యాత్ర చేస్తూ తిరునావాయ్ – అనే దివ్యదేశాన్ని సమీపించారు. అపుడు తమకు ఎదురుగా వచ్చిన మలయాళదేశవాసులను చూచి "తిరువాయ్ క్షేత్రం ఇంకా ఎంత దూరం ఉన్నది?" అని అడిగారు. దానికి వారు **"కుఱుక్కుమ్"** అని బదులిచ్చారు. (**"కుఱుక్కుమ్"** – అనే మలయాళ పదానికి దగ్గరలో ఉన్నది – అని అర్థం) మాటను ఆలకించిన శ్రీరామానుజులు **"కుఱుక్కుమ్ వకై యుణ్డుకొలో!"** అని ఆ*ళ్వా*ర్లు పల్కినదానిని తలచి, "ఈ దివ్యదేశాన్నిగూర్చిన పాశురంలో ఈ దేశభాషలోనే ఆ*ళ్వా*ర్లు పల్కడం ఎంత సొగసు!" అని చాలా ప్రావణ్యాన్ని పొందారు. ఇరుపత్తు నాలాయిరప్పడిలో కూడా ఈ ఐతిహ్య ప్రస్తావన ఉన్నది.

## (41) 9–9 – ఈడు ప్రవేశం

**"ప్రాప్యవస్తువై పెరుమ్బడియై మనోరథిత్తార్, కీ*ళ్*ల్ తిరువాయ్ మొ*ళి*యిలే, మనోరథ సమనంతరమ్ పెఱక్కాణామైయాలే తిరువాయ్ ప్పాడియిలుళ్ళార్ కృష్ణనై ప్పిరిన్దు, ఒరు రాత్రి పట్ట వ్యసనత్తై ఇవర్ ఒరుత్తరుమ్ పడుకిఱార్ "ఎన్ఱు ఆళవందార్ అరుళిచ్చెయ్యుమ్బడి – ఎన్ఱు తిరుమాలై యాణ్డాన్ పణిక్క, అత్తై ఎమ్బెరుమానార్ కేట్టరుళి, "మున్బే ఆ*గ్రా*మైయాలే తఱ్ఱు ఆ*గ్రి*రుక్కిఱవర్ ఆకైయాలే, అత్తనై ఆదల్ కొడుక్కైక్కు వేణ్డుమ్ ఆశ్రయమ్ పోరాదు. ఆన పిన్బు అవనై ప్పిరిన్దు ఒరు సంధ్యైయిల్ పట్టవై ప్పడుకిఱాళ్" – ఎన్ఱు అరుళిచ్చెయ్‌దార్.**

**"మల్లికై కమ*ఴ్*"** ( 9 – 9 ) అనే దశకంలో రేపల్లెలోని గోపికలు అంతా శ్రీకృష్ణుని విశ్లేషించి పడిన క్లేశాన్ని అంతటినీ తాము ఒక్కరే పడుతున్నట్లు గోపికా భావనతో ఆ*ళ్వా*ర్లు పలికారు. ఈ దశకానికి ప్రవేశాన్ని అనుగ్రహించే నమ్బిళ్ళై, ఆళవందార్, ఎమ్బెరుమానార్ పల్కిన అర్థ నిర్వాహాలను తెలిపారు.

ఈ దశకానికి ముందు పల్కిన **"అఱుక్కుమ్ వినై"** (9–8) అనే దశకంలో

భగవానుని పొందే రీతినిగూర్చి ఆ*ళ్వా*ర్లు తలచారు. తలచిన వెంటనే ఆ విధంగా స్వామిని పొందలేనందున చాలా క్లేశం కల్గింది. రేపల్లె లోని కన్నెలు. అందఱు శ్రీకృష్ణుని విశ్లేషించి ఒక రాత్రివేళ పడిన దుఃఖాన్ని అంతటినీ ఆ*ళ్వా*ర్లు ఒక్కరే పడుతున్నారు – అని ఆళవందార్ పలికారని తిరుమాలై యాణ్డాన్ తెలిపారు.

భగవానుని పొందలేని దుఃఖంతో ముందే బలాన్ని కోల్పోయిన పరాంకుశ నాయకికి ఒక రాత్రి అంతా క్లేశపడి నిలువగల్గిన అవధిలో వారి శరీరంలో బలం లేదు. కనుక రేపల్లెలోని కన్నెలు అందఱు ఒక సంధ్యాసమయంలోపడిన క్లేశాన్ని తామొక్కరే పడుతున్నారు – అని శ్రీరామానుజ నిర్వాహం.

ఇరుపత్తు నాలాయిరప్పడిలో కూడా ఈ రెండు నిర్వాహాల ప్రస్తావన ఉన్నది. **"మాలై"** – అనే పదానికి సంధ్యాకాలమని, రాత్రి అని – రెండుర్థాలున్నందున, ఆళవందార్ నిర్వాహంలో **"రాత్రి"** అని, శ్రీరామానుజ నిర్వాహంలో **"సంధ్య"** – అనే అర్థాలు గ్రహింపబడ్డాయి. ఆళవందార్ నిర్వాహంలో కంటే శ్రీరామానుజుల మా నిర్వాహంలో పరాంకుశనాయకి యొక్క మనోమార్దవాతిశయం తెలుపబడింది. అంతేకాక, గోపికల విరహక్లేశాసహిష్ణుత్వం కంటే పరాంకుశనాయకిక్లేశాస హిష్ణుత్వం ఎక్కువని కూడా తెలుపబడింది. అందువల్ల స్వారస్యం ఎక్కువ.

**(42) (9-9-8) – ఇరుపత్తు నాలాయిరపడి**

**(అదు మణన్దు అకన్ఱ) ...ఇప్పడి అవగాహిత్త ఇవర్ పాశురమిన్నిక్కే పాడానిఱ్క, నామ్ ఇదుక్కు ఎన్న పాశుర మిట్టు చ్చొల్లువదు? మోరుళ్ళతనైయుమ్ శోఱేయో?" ఎన్ఱు ఎమ్బెరుమానార్ అరుళిచ్చెయ్‌దార్**

శ్రీకృష్ణుని సంశ్లేషించి, తరువాత విశ్లేషించిన గోపికల భావనలో పాశురాలను **"మల్లిక్కై కమ*ழ்*"** అనే దశకంలో అనుగ్రహించిన ఆ*ళ్వా*ర్లు **"అదు మణన్దు అకన్ఱ నమ్ కణ్ణన్ కళ్వమ్ కణ్ణనిల్ కొడిదు"** (ఆ విధంగా విశ్లేషించిన కృష్ణుని తుంటరి పనులు అతనికంటె కఠినమైనది) అని అన్నారు. ఇక్కడ **"అదునుమణన్దు అకన్ఱు"** – అనే ప్రయోగానికి శ్రీరామానుజులు పల్కిన వివరణాన్ని పెరియవాచ్చాన్ పిళ్ళై ప్రస్తావించారు.

ఆఌ్వార్లతో భగవానుడు సంశ్లేషించిన వైభవాన్ని ఆ ఆఌ్వార్లే స్పష్టంగా చెప్ప లేక **"అదు మణన్దు"** అని పరోక్ష నిర్దేశంతో అన్నారు. ఇక దీనిని మనం ఏ విధంగా వివరించగలం? మోరు ఉన్నంత వరకు అన్నాన్ని పెట్టగలమా? (అదేవిధంగా ప్రశ్నలున్నంత అవధిలో బదులు చెప్పడం సాధ్యమా!) అని శ్రీరామానుజులు పలికారట.

ఈడు వ్యాఖ్యానంలో ఈ వార్తా ప్రసక్తి కన్పించదు. ఈ వివరణాన్ని ఎమ్బార్ పల్కినట్లు – తిరువాయ్మొఌి ఈడువ్యాఖ్య (4–6) దశక ప్రవేశంలో, (9–9–9) పాశురానికి ఈడు వ్యాఖ్యలో తెలుపబడింది.

**"మోరుళ్ళదనైయుమ్ శోఱేయో?"** అనే ఆభాణకాన్ని వివరిస్తూ అరుంబద కారులు ఈ క్రింది వృత్తాంతాన్ని ఉదాహరించారు – ఒకడు ఒక గృహిణి వద్ద కొంత బియ్యాన్ని ఇచ్చి, "అమ్మా! నా దగ్గర కొంచెం మోరు (మజ్జిగ) ఉన్నది. దానికి సరిపోయేటట్లు ఈ బియ్యాన్ని అన్నంగా వండిపెట్టు" అని అన్నాడు. ఆమె ఆ విధంగానే ఆ బియ్యాన్ని వండింది. అతడు తనదగ్గర ఉండే కొంత మోరును తీసికొని కొంత అన్నాన్ని తిన్నాడు. తరువాత "అమ్మా! కొంచెం మోరు మిగిలి ఉన్నది. ఇంకొంచెం అన్నం పెట్టు" అన్నాడు. ఆమె ఇంకా కొంచెం అన్నం పెట్టింది. దానిని భుజించిన అతడు మళ్లీ "అమ్మా! ఇంకా కొంచెం అన్నం పెట్టు. మోరు ఇంకొంచెం మిగిలి ఉన్నది" అన్నాడు. ఇంకొకసారి ఆమె ఇంకా కొంత అన్నం పెట్టింది. దానిని భుజించి అతడు మళ్ళీ మళ్ళీ అన్నం పెట్టమని ఆమెను అడిగాడు. అపుడా గృహిణి" నాయనా! నీ దగ్గర మోరు ఉన్నంతవరకు నేను అన్నం పెట్టగలనా? అన్నం ఉన్నంత వరకే కదా పెట్టగలను" అన్నది.

**(43) (10–6–1) ఈడు**

**(అదు నమదు విదివకైయే) "అదు నమ్ముడైయ భాగ్యానుగుణమాక విఱే" ఇత్తై ఎమ్బెరుమానార్ కేట్టరుళి, "ఇత్తిరువాయ్మొఌియిల్ మేలోడుకిఱ రసత్తోడు శేరాదు, నామ్ విదిత్త పడియే శెయ్వానాయిరున్దాన్ – ఎన్గిఱార్ – ఎన్ఱు అరుళిచ్చెయ్ వర్.**

**"ఆ౹్ళియాన్ అరుళ్‌తరువాన్ అమైకిన్ఱాన్ అదు నమదు విదివకైయే"** (మనం విధిప్రకారమే భగవంతుడు అనుగ్రహించాలని చూస్తున్నాడు) అని ఆళ్వార్లు పల్కిన సూక్తిని నమ్పిళ్ళై వ్యాఖ్యానిస్తూ ఈడువ్యాఖ్యలో పూర్వుల నిర్వాహాన్ని, శ్రీరామానుజుల నిర్వాహాన్ని ప్రస్తావించారు.

భగవంతుడు మన పుణ్యాలకు అనుగుణంగా మనకు అనుగ్రహాన్ని చేయచూస్తాడు. అని పూర్వాచార్యుల నిర్వాహం. **"విధి"** అనేది భాగ్యాన్ని తెల్పుతున్నదనే అర్థంలో ఈవిధంగా అర్థంచెప్పబడింది.

శ్రీరామానుజులు "ఈ దశకంలో అంతా భగవంతుడు భక్తులకు పరతంత్రుడై ఉంటాడని ఆళ్వార్లు పలికారు. కనుక, భగవానుడు పుణ్యానికి తగినట్లే అనుగ్రహించాలని చూస్తాడని అనడం ఈ ప్రకరణానికి పొసగదు. కనుక, **"విదివకైయే"** అనేదానికి "మనం విధించిన రీతిలోనే" అనే అర్థాన్ని చెప్పాలి. అంటే – మనం విధించిన రీతిలోనే' అనే అర్థాన్ని చెప్పాలి. అంటే – మనం విధించిన ప్రకారమే చేయాలని భగవంతుడున్నాడు – అని ఆళ్వార్లు పల్కుతున్నాడని అనడమే సబబు – అని అన్నారు. అందువల్ల దశక ప్రకరణాను గుణం ఈ నిర్వాహం. తిరుప్పావైలోని **"నారాయణనే నమక్కే పఱై తరువాన్, పారోర్ పుకళ"** లోకులంతా పొగడే రీతిలో భగవానుడు మనకు ప్రాప్యాన్ని అనుగ్రహిస్తాడు – అనే సూక్త్యర్థానికి అనుగుణం.

లోకంలో కూడా భార్యపై అత్యంత వ్యామోహం కల్గిన భర్త ఆమె విధించిన రీతిలోనే కదా కార్యాలను చేస్తాడు. లేకపోతే విరసమే అవుతుంది. ఆవిధంగానే భగవంతుడు కూడా, పరాంకుశ నాయకిపై మిక్కిలి ప్రణయాన్ని కలవాడైనందున, వారు విధించిన ప్రకారమే అనుగ్రహిస్తాడని అర్థం చెప్పడమే సరసం. ఇంతేకాక లోక రీతిలో కూడా ఇదే యుక్తం. ఒకని ప్రార్థన అంగీకరించే టపుడు కూడా అతని అభిప్రాయాన్ని తెలిసికొని కదా అంగీకరించాలి. అపుడే కదా అది పురుషార్థం అవుతుంది. "వితివకైయే అనే ప్రయోగంలోని ఏ కారం. ఆళవందార్ నిర్వాహంలో నిశ్చయార్థకం. శ్రీరామానుజ నిర్వాహంలో ఆశ్చర్యార్థకం. సంస్కృత వేదంలోని పదాలకు స్వరాలలోని భేదాన్ని బట్టి వేర్వేరు అర్థాలు చెప్పబడేటట్లే, ద్రావిడ వేదమైన

ఆ( )ళ్వర్ల ప్రబంధాలలోని ప్రయోగాలకు కూడా స్వరభేదాన్ని అర్థభేదాన్ని పూర్వాచార్యులు తెలిపారు – అనేదానికి ఇది ఒక దృష్టాంతం.

నిఘంటువులో కూడా **"దైవం దిష్టం భాగధేయం భాగ్యం స్త్రీ నియతిర్విధిః"** అని విధిశబ్దం భాగ్యవాచకంగా, నియతిగా పఠింపబడింది. శ్రీరామానుజ నిర్వాహానుగుణంగానే ఈడు, ఇరుపత్తునాలాయిరప్పడి వ్యాఖ్యలలో అవతారిక చూపబడింది. ఆఱాయిరప్పడి, కన్నీరాయిరప్పడి వ్యాఖ్యలలో కూడా శ్రీరామానుజ మతానుసారంగానే వివరింపబడింది. అయితే, పన్నీరాయిరప్పడిలో ఆ( )ళ్వర్లు విధించిన రీతిలో భగవానుడు అనుగ్రహించడానికి కారణం – పురుషార్థం కావడం కోసమని తెలుపబడింది.

ఇరుపత్తునాలాయిరప్పడిలో కూడా ఈ నిర్వాహప్రస్తావన ఉన్నది.

**(44) (10-7-1) - ఈనాడు**

**(ఆట్చెయ్‌మిన్) "ఆ*ழ*జ్గాలిలే ఇ*ழ*ిన్దు అమి*ழ*్‌వార్ అవ్విడత్తే కొణ్డైక్కోల్ నాట్టుమాపోలే కొణ్డక్కోల్ నాట్టుకిఱార్" - ఎన్రు శి*ఱ్ఱా*ట్కొణ్డాన్. ఉడైయవర్ "ఇన్నార్ ఉయిర్ ఎన్నామైయాలే అవన్ ఉయిరై కాత్తు ఆట్చెయ్‌మిన్‌కళ్" ఎన్రు అరుళిచ్చెయ్‌వర్.**

**"శెఞ్జొల్కవికాళ్! ఉయిర్ కాత్తు ఆట్చెయ్‌మిన్"** (అందమైన పదాలతో కవిత్వాన్ని పలికే కవులారా! మీ ప్రాణాలను కాపాడుకొని, దాస్యం – కైంకర్యం – చేయండి) అని ఆ*ళ*్వార్లు అనుగ్రహించారు. భగవంతుడు మన కైంకర్యాన్ని స్వీకరించేవాని వలె ప్రవేశించి, తన సౌలభ్యగుణాన్ని చూపి, మన ప్రాణాలను కొల్లకొడతాడు. కనుక, ఆ సౌలభ్యగుణంలో మునిగి పోకుండా, కైంకర్యాన్ని చేయాలని చూడండి– అని ఆ*ళ*్వార్లు పల్కుతున్నారు. ఈ సందర్భాన్ని వివరించే నమ్బిళ్ళై శి*ఱ్ఱా*ట్కొణ్డాన్, శ్రీరామానుజులు పల్కిన నిర్వాహాలు రెండింటిని ప్రస్తావించారు.

శి*ఱ్ఱా*ట్కొణ్డాన్ అనే ఆచార్యులు "నీరు నిండగా ఉండే చోట్లలో లోతుగా ఉండే చోట మునిగిపోయేవారు, మిగిలినవారు ఆ లోతైన చోట్లలో చిక్కి మునిగిపోకుండా ఉండడంకోసం హెచ్చరిక చేసే ఉద్దేశ్యంతో లోతు పరిమితిని

చూపే స్తంభాలను నాటుతారు. ఆ రీతిలోనే, ఆ*ళ్వా*ర్లు కూడా, భగవంతుని శీల గుణంలో మిగిలినవారు చిక్కుకొని మునిగిపోకుండా ఉండడం కోసం **"ఉయిర్ కాత్తు ఆట్చెయ్‌మిన్"** అని పల్కి, హెచ్చరికను చేసే స్తంభాన్ని (**"కొణ్డై కోల్"**ను) నాటి నట్లుగా, మిగిలినవారిని హెచ్చరిస్తున్నారు – అని అర్థాన్ని ఈ సందర్భంలో నిర్వహించారు. ఈ నిర్వాహం ఇరుపత్తు నాలాయిరప్పడిలో కూడా ఉన్నా, అక్కడ శి*గ్*గ్రాట్కొణ్డాన్ పేరు ఉట్టంకింపబడలేదు.

ఇరుపత్తునాలాయిరప్పడిలో శి*గ్*గ్రాట్కొణ్డాన్ నిర్వాహానుగుణంగా వివరింప బడింది. **"ఉజ్గళై నోక్కి క్కొణ్డు కవిపాడ ప్పారుజ్గోళ్".** ఆట్కాళ్ వానత్తు ఎన్ను యిరుణ్డమాయన్" ఎన్గిఅ పడియే అడిమై కొళ్వానైప్పోలే పుకున్దు ఇత్తలై య( )క్కు మవనాయ్‌త్తు. పరిహరిత్తుప్పారుజ్గోళ్. ఆ( )జ్కాలిలే యి( )న్దు అమి( )న్దు మవర్‌కళ్ అవ్విడత్తిలే కొణ్డకోల్ నాట్టుమాప్పోలే, "వమ్మిన్ పులవర్" ఎన్టుముద విలేరుచి ఇల్లా దారైయుమ్ అ( )క్కిఅ ఇవర్, శీలాదిగుణజ్గళిలే అ( )న్ది, ఇ()కిఅవర్‌కళై యుమ్ వేణ్డా – ఎన్గిఅరిఱే, ప్రీతి ప్రకర్షత్తాలే" (మిమ్ములను కాపాడుకొని స్తుతించండి. కైంకర్యం స్వీకరించే వానివలె వచ్చి, నాప్రాణాన్ని ఆరగించిన మాయావి – అనేవిధంగా కైంకర్యం గ్రహించే వానివలె వచ్చి, మనలను లేకుండా చేసేవాడు. మానివేయడానికి ప్రయత్నించండి. లోతైన చోట దిగి మునిగి పోయేవారు, అక్కడ ఒక హెచ్చరికను చేస్తే స్తంభాన్ని నాటేటట్లుగా, "కవులారా! రండి" అని పూర్వం ఆసక్తి లేనివారిని కూడా పిలిచిన ఆ( )ర్లు భగవానుని శీలాది గుణాలలో మునిగిపోయి, గుణాలను స్తుతించాలని ప్రయత్నించేవారిని వద్దని అంటున్నారు కదా, ప్రీత్యతిశయం వల్ల) అనే అందులోని వివరణం గమనించ దగినది. ఆఅయిరప్పడిలో, ఎన్నిరాయిర ప్పడిలో కూడా శి*గ్*గ్రాట్కొణ్డాన్ నిర్వాహపరంగానే వివరింపబడింది. **"ఆట్కోళ్‌వానత్తు"** అనే ఆ*ళ్వా*ర్ల సూక్తికి శి*గ్*గ్రాట్కొణ్డాన్ నిర్వాహం అనుగుణ మైనందున దీనిని మిగిలిన వ్యాఖ్యాతలు గ్రహించి ఉండవచ్చు.

శ్రీరామానుజులు ఇక్కడ పాశురంలో **"ఉయిర్ కాత్తు ఆట్చెయ్‌మిన్"** అని సాధారణంగా ఉన్నదే తప్ప ఎవరి ప్రాణాలను రక్షించుకొంటూ కైంకర్యం చేయాలనేది స్పష్టంగా పలుకలేదు. కనుక, "భగవంతుని ప్రాణాలను రక్షించి, కైంకర్యం చేయండి" అని ఆ*ళ్వా*ర్లు పల్కుతున్నారని అర్థనిర్వాహాన్ని చేశారు. అంటే – భగవంతుడు తన

సౌలభ్యగుణాన్ని చూపి, తమతో అతడు కలసి వర్తించాలని అనుకొన్నప్పుడు” అతడు ఉన్నతుడుకదా! మనం నీచులం కదా! అతనితో మనం ఏ విధంగా కలసి వర్తించడం?” అని భావించి వెనుకంజ వేయాలని అనుకోవడం అతనిని కోల్పోవడానికే హేతువు అవుతుంది. అందువల్ల ఆ విధంగా వెనుకడుగు వేసి, అతనిని కోల్పోకుండా, అతని ప్రాణాలను కాపాడి, అతడు కోరే దాస్యాన్ని అతడు మనకు చేయడానికి అంగీకరించి, ఉజ్జీవించండి – అని ఆ*ళ్వా*ర్లు పల్కుతున్నారని శ్రీరామానుజులు అర్థాన్ని చెప్పారు. ఈ నిర్వాహానికి అనుగుణంగా తిరువాయ్‌మొ*ళి*లోని **“వళవే *ళు*లకు”** (1–5) దశక ప్రమేయం భావ్యం. ఆ దశకంలో ఆ*ళ్వా*ర్లు తమ నైచ్యాన్ని భావించి భగవానునకు దూరంగా వెళ్ళిపోయే ప్రయత్నం చేయడమే కదా శ్రీరామానుజుల నిర్వాహం. చేతన లాభం ఈశ్వరునిదే ప్రమేయం – అనే ప్రబంధ ప్రధాన ప్రతిపాద్యార్థానికి అనుగుణం.

కనుక శ్రీరామానుజ నిర్వాహం ఉభయవేదాంత సమన్వయాత్మకం. శి( )ట్కాణ్డాన్ వీరి నిర్వాహాలు పెరియా*ళ్వా*ర్ తిరుమొ*ళి* 2–1–9 పాశురానికి తిరువాయ్ మొ*ళి*ప్పిళ్ళై వ్యాఖ్యలో తిరువాయ్‌మొ*ళి* (3–1–9), (4–9–3) పాశురాలకు ఈడు వ్యాఖ్యలో, (9–7–5) పాశురానికి ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యలో ప్రస్తావించబడ్డాయి. దీనినిబట్టి వీరి జ్ఞానవైశద్యం ఎంత గొప్పదో తెలుస్తున్నది.



**రస్యార్థానాంచ నిర్వాహాః సంమతాః రామానుజ**